


సంపుటి: 3 సంచిక: 6 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 రూ. నవంబర్ 2017



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

వీరాంజనేయులు: 7799260684

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510



# విషయ సూచిక





ముఖ చిత్రం: శక్తి

చిత్రకారుడు: అడవి రాముడు

కొత్తపల్లి 94 వ పుస్తకం!




---

సంతప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే
ముక్తాకారతయా తదేవ నలినీ పత్ర స్థితం దృశ్యతే ।
అంతస్సాగర శుక్తి మధ్య పతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమ మధ్య మోత్తమ జుషా మేవంవిధా వృత్తయం:॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

నీరము తప్త లోహమున నిల్చి యనామకమై నశించు, నా
నీరమె ముత్యమట్లు నళినీ దళ సంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలో బడి మణిత్వము గాంచు సమంచిత ప్రభన్ బౌ
రుషవృత్తు లిట్లధము, మధ్యము, నుత్తము గొల్చువారికిన్

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం: బాగా వేడెక్కిన ఇనుము మీద పడిన నీటి చుక్క ఎవరికీ కాకుండా పోతుంది. అదే నీటి చుక్క, తామరాకు మీద పడినప్పుడు ముత్యం మాదిరి మిలమిలా మెరుస్తుంది. మరి ఆ నీటి చుక్కే సముద్ర మధ్యంలోని ఆల్చిప్పలో పడినప్పుడు నిజమైన ముత్యమై వెలుగొందుతుంది. అట్లాగే, మనం ఎవరితో పనిచేస్తున్నాం అన్నది మనం ఎలా తయారవుతామో నిర్ణయిస్తుంది. మంచివారితో కలిసి పనిచేస్తే మనమూ మంచివాళ్ళమవుతాము అని భావం.

# మట్టి పాత్ర



సుదర్శన్ అని, పూర్వ విద్యార్థి గుర్తు చేసిన కథ ఇది. అనగనగా ఓ శివాలయం ఉండేది. దాని పూజారి శంకరశాస్త్రి, గొప్ప పుణ్యాత్ముడు. "ఆయన అభిషేకం చేసి ఇచ్చే తీర్థం త్రాగితే అనేక రోగాలు నయమవుతాయి" అని చెప్పుకునేవాళ్ళు జనం. ప్రతిరోజూ ఆయన చేతిమీదుగా తీర్థం, విభూతి స్వీకరించటం కోసం చుట్టు ప్రక్కల అనేక గ్రామాల్లోంచి భక్తులు వస్తూండేవాళ్ళు.

ఒకసారి ఆయనకు శివుడు కలలో కనిపించాడు. "స్వామీ, ఏ రోజుకారోజు నీ రాక కోసం ఎదురు చూడటం తప్పిస్తే, మరింకేవీ నాకు తృప్తినివ్వటం లేదు. నన్ను నీతో తీసుకొని పోరాదా?" అని అడిగాడు శంకరశాస్త్రి, ఆయనకు నమస్కరిస్తూ.



శివుడు నవ్వి, "దానికోసం నువ్వు మరింత కృషి చేయవలసి ఉన్నది" అంటూ తన చేతిలో ఉన్న మట్టిపాత్రను అతని చేతిలో పెట్టాడు-

"ఇదిగో, ఈ మట్టి పాత్రను చూసావు కదా; ఇది ఎవరి చేతిలో ఉన్నప్పుడు బంగారం లాగా మెరుస్తుందో, అట్లాంటి వాళ్ళు అత్యంత పుణ్యవంతులన్నమాట. వాళ్ళు చేస్తున్నవి పవిత్ర కర్మలు. ఆ కర్మల కారణంగానే వారికి అనంత దీర్ఘాయుష్షు, ఆ తర్వాత నా సాన్నిధ్యం

లభించనున్నాయి" అని చెప్పేసి, మాయమైపోయాడు శివుడు.



మొదట 'ఇదేదో అద్భుతమైన కల' అనుకున్నాడు గానీ; ఆ తర్వాత ఆలయానికి వెళ్ళి చూసేసరికి నిజంగానే అక్కడ ఓ మట్టిపాత్ర కనిపించింది శంకరశాస్త్రికి. ఆయన చాలా భక్తిగా ఆ మట్టిపాత్రను తాకి చూసాడు: అది రంగు మారలేదు!

అయితే స్వతహాగా మంచివాడైన శంకరశాస్త్రి అందుకు బాధపడలేదు. "నేను ఇంకా పుణ్యం సాధించాలి అని తెలియజేసేందుకుగాను భగవంతుడు ఇచ్చిన కానుక ఇది! ఇప్పుడిక దీన్ని కొలమానంగా వాడి, ఆలయానికి వచ్చేవాళ్ళలో అసలైన పుణ్యాత్ములెవరో గుర్తిస్తాను. వాళ్ళ అడుగుజాడల్లో నడచి, నేనూ పవిత్రుడినౌతాను" అనుకున్నాడు.

ఆ రోజునుండీ గుడికి వచ్చే భక్తులందరిచేతా ఆ మట్టి పాత్రను తాకించేవాడు ఆయన. చుట్టుపక్కల గ్రామాల్లో అన్నదానాలు, హోమాలు, యజ్ఞాలు, యాగాలు చేసి పేరెన్నిక గన్న భక్తులు ఎందరో వచ్చి మట్టిపాత్రను తాకారు. ఎంతమంది తాకినా అది మట్టి పాత్రగానే ఉండింది తప్ప, రంగు ఏ కొంచెం కూడా తిరగలేదు.

ఇలా రోజులు గడుస్తూ ఉన్నాయి. ఒకసారి, మహా శివరాత్రి సందర్భంగా గుడిలో వేడుకలు జరుగుతున్న సమయంలో, ఎవరో ఒక బాటసారి అటుగా వచ్చాడు- మాసిన గడ్డంతో, మురికి పట్టిన వస్త్రాలతో- దైవదర్శనం కోరి వచ్చాడు.

చలి బాగా ఉన్నది. ఆ సమయంలో మెట్ల దగ్గర అడుక్కుంటూన్న ముసలాయన ఒకడు చలికి వణికిపోవటం మొదలెట్టాడు. భక్తులందరూ ఎవరి తొందరలో వాళ్ళు ఉడ్నారు- అతన్ని

ఎవరూ గమనించలేదు; గమనించినా పట్టించుకోలేదు. పూజారి శంకరశాస్త్రి కూడా ముసలాయన్ని చూసి; జాలి పడ్డాడు- కానీ "ఇంత రద్దీ ఉన్న సమయంలో నేను ఏం చేయగలను?" అనుకొని ఊరుకున్నాడు.



అయితే వచ్చిన ఆ బాటసారి మటుకు ముసలాయన దగ్గర ఆగాడు. తన భుజం మీద ఉన్న కంబళిని తీసి అతనికి కప్పాడు. ఆ పైన తన చొక్కా కూడా తీసి అతనికి తొడిగాడు. బయటికి వెళ్ళి, వేడి వేడి టీ తెచ్చి అతని చేత త్రాగించాడు. భగవంతుడికి అర్పించేందుకుగాను తను తెచ్చిన పండును కూడా ముసలాయనకు ఇచ్చివేసాడు. ఆ తర్వాత ఒట్టి చేతులతో గుడిలోకి వచ్చాడు.



గమనించిన శంకరశాస్త్రి ఆలోచనలో పడ్డాడు. "ఈ ముసలతన్ని నేను రోజూ చూస్తుంటాను; పలకరిస్తుంటాను- అయినా అతనికి సాయం అవసరమైనప్పుడు నేను ముందుకు రాలేదు. ఈ బాటసారి ఎవరో నిజంగానే పుణ్యాత్ముడు- తను కప్పుకున్న చొక్కాని కూడా కరుణతో ఇచ్చేసాడు. పరోపకారాన్ని మించిన ధర్మం లేదు అని శాస్త్రం ఘోషించటంలేదా? నేను నా ధర్మాన్ని విస్మరించాను. ఇక ఎప్పుడూ అలా చేయను. ఇతరుల కష్టాల్ని తీర్చేందుకు నావంతుగా కృషి చేస్తాను!" అనుకుంటూ సిగ్గుపడ్డాడు.

ఇన్నాళ్ళుగా లేనిది, ఆ రోజున ఆయన చేయి సోకగానే మట్టి పాత్ర కొద్దిగా బంగారు వర్ణంలోకి మారినట్లు తోచింది- బాటసారి చేయి సోకే సరికి అది నిజంగానే వెలుగులు చిమ్మింది!




ఆనందాతిశయంతో కళ్ళు మూసుకున్న పూజారి శంకరశాస్త్రి కళ్ళు తెరిచి చూసే సరికి ఎదురుగా బాటసారి లేడు! 'సాక్షాత్తూ శివుడే ఈ రూపంలో తనకు మార్గం చూపించాడు' అనిపించింది, ఆశ్చర్యంతో నోరు తెరిచిన శంకరశాస్త్రికి.

అటుపైన "ఏలాంటి ప్రయోజనాన్నీ ఆశించకుండా ఇతరులకు సహాయం చేయాలి అందరం- అదే పుణ్యం అంటే!" అని ఆచరణలో చూపిస్తూ చరితార్థుడైనాడాయన.

కార్తీక మాసంలో వనభోజనాలు చేస్తూ, శివాలయాలు తిరిగేటప్పుడు ఈ కథలోని స్ఫూర్తిని గుర్తుచేసుకుంటారు కదూ?

అభినందనలతో

కొత్తపల్లి బృందం.



**పొడుపు కథలు:**

గుడిచుట్టూ తిరిగి గుళ్ళో నీరు పోసింది- ఏంటది?

పొంచిన దెయ్యం పోయినచోట ప్రత్యక్షం- అదేంటి?

అందమైన సరస్సులో ఎర్ర మూతి పిట్ట, తోకతో నీళ్ళు తాగుతుంది- అదేంటి?

నూరు మంది అన్నదమ్ములకు ఒక్కటే తాడు! ఏమిటా కథ?

జవాబులు: బెండకాయ, నీడ, వత్తి, చీపురు.




# అమ్మమ్మ ఊళ్ళో దావీదు-1

*బిట్టు కథలు - రెండో భాగం*

*రచన: శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, కృష్ణా జిల్లా.*

ఆంధ్రలో ఉండే అమ్మమ్మ ఊరికి ప్రయాణమయ్యాడు బిట్టూ, అమ్మ సునందతోపాటు. మూడేళ్లైంది, వాడు అమ్మమ్మ ఊరికి రాక! అందుకని ఈ సారి వాళ్లకి ఇంకెక్కడికీ వెళ్ళే పని లేదు: అమ్మమ్మ ఊరొక్కటే.

అమ్మమ్మ వాళ్ల ఊరు పేరు పోరంకి. ఊరు చిన్నదే, ఐనా పట్టణానికి బాగా దగ్గర. అందుకే అక్కడ పల్లె అందాలూ కనిపిస్తాయి; పట్టణ సౌకర్యాలూ ఉంటాయి: రెండు ప్రపంచాలన్నమాట.

అమ్మమ్మ, తాతయ్య కాకుండా ఆ ఇంట్లో తాతమ్మ కూడా ఉంటుంది. ఆవిడకి తొంభై రెండు సంవత్సరాలు. ఆవిడ బిట్టుని చూసి

తెగ మురిసిపోయింది. మనవరాలి కొడుకు కదా, ఢిల్లీ నుంచి వచ్చాడు! 'దగ్గర కూర్చోరా, కబుర్లు చెబుతా, రా' అని పిలుస్తుండేది. తాతమ్మకి ఒక్క పన్నూ లేదు. బిట్టూకేమో విచిత్రంగా ఉంది- ఆవిడ తింటున్నా, మాట్లాడుతున్నా!

కొడుకుని అక్కడ వదిలి పెట్టి, సునంద మళ్ళీ ఢిల్లీ వెళ్ళిపోయింది: 'సెలవులు చక్కగా గడుపు; అమ్మ-నాన్న లేరు కదా అని అల్లరి చెయ్యకు; అమ్మమ్మని విసిగించకు; తాతయ్య ఆఫీసునుంచి వచ్చాక రోజూ ఆయనతో చెస్ ఆడు; ఆయనతోపాటు ఉదయపు నడకకి వెళ్తూండు; తాతయ్య దగ్గర కూర్చుని లెక్కలు, తెలుగు నేర్చుకో; చుట్టుప్రక్కల అందరితో స్నేహంగా ఉండు' లాంటి జాగ్రత్తలు అన్నీ చెప్పేసి.

మామూలుగా ఐతే పెద్ద అల్లరి చేసే అబ్బాయి కాదు బిట్టూ. కానీ అమ్మమ్మ, తాతయ్య గారాబం చేస్తారు కదా, అందుకని ఢిల్లీలో కంటే కాస్త ఎక్కువ స్వేచ్ఛగానే మసలుతున్నాడు. ఎటొచ్చీ వాడి తెలుగుతోటే కాస్త ఇబ్బంది అక్కడ అందరికీ. బిట్టూ తెలుగులోనే మాట్లాడతాడు. కానీ ఆ మధ్యలోనే హిందీ పదాలు చేర్చేస్తుంటాడు. కొన్ని వాక్యాలనైతే అసలు పూర్తిగా ఏ హిందీలోనో, ఇంగ్లేషులోనో చెప్పేస్తాడు.

ఒకరోజు తమాషా సంఘటన ఒకటి జరిగింది: ఆఫీసునుండి వస్తూ తాతయ్య పాలకోవా తెచ్చారు. బిట్టూకి ఎక్కడ లేని ఉత్సాహం వచ్చింది. 'ఐ లైక్ పేడా- ఐ లైక్ పేడా' అని అరిచాడు ఆనందంగా.

అయితే అక్కడ ఉన్నవాళ్ళంతా కంగారు పడుతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు: "వీడు పేడ ఎక్కడ చూసాడబ్బా, అది వీడికి ఎందుకు ఇష్టం అయ్యింది?" అని, బిక్క మొహాలు వేసారు వాళ్ళు.

కానీ అసలు సంగతేంటంటే, పాలకోవాని హిందీలో 'పేడా' అంటారు! చివరికి అమ్మమ్మకు ఆ సంగతి గుర్తొచ్చి, అందరికీ చెప్పేసింది; అందరూ గొల్లున నవ్వారు. బిట్టు

మటుకు ఉడుక్కున్నాడు: 'నాకు తెలుగు నేర్పండి' అని మూతి ముడుచుకొని కూర్చున్నాడు.

'ప్రత్యేకంగా నేర్పే అవసరం లేదురా, ఇది నీ మాతృభాష. తెలుగు మాట్లాడే వాళ్ల మధ్య ఉంటూ, వాళ్ల మాటలు వింటూ, వాళ్ళతో మాట్లాడుతూ ఉంటే వచ్చేస్తుంది' బుజ్జగించి చెప్పారు తాతయ్య.

'అసలు నా తెలుగుని చూసి మీరంతా ఇంత నవ్వుతున్నారు కానీ, దిల్లీ వెళ్తే నేను ఎవ్వరితో మాట్లాడతాను తెలుగు? నాకు ఒక్క తెలుగు ఫ్రెండ్ కూడా లేడు! ఇంక నేర్చుకొని ఏం లాభం?' అన్నాడు బిట్టూ, నిరాశ పడుతూ.

'లేదురా, 'మాతృభాష రావటం' అనేదే నీకు ఒక అదనపు అర్హత అవుతుంది- తెలుసా, పై చదువుల కోసం వెళ్ళినప్పుడు కొన్ని విశ్వవిద్యాలయాల్లో 'నీకు మాతృభాష వచ్చా?' అని ప్రత్యేకంగా అడుగుతారు.

అదీ కాక నువ్వు కవితలు రాస్తావు కదా; ఆలోచనల్ని నీ సొంత భాషలో చెప్పటం ఇంకా బాగుంటుంది' చెప్పాడు తాతయ్య. దాంతో బిట్టు కొంచెం సమాధాన పడ్డాడు. 'తెలుగు బాగా నేర్చుకోవాలి' అనుకున్నాడు. అప్పటి నుంచి ఎవరు తెలుగులో మాట్లాడినా, పనిపడా వినటం మొదలు పెట్టాడు. తన కవితా రచనని కూడా కొనసాగించాడు.

ఇంటికి వచ్చిన వాళ్లందరికీ వాడి కవిత్వం చదివి చెప్పేవాళ్ళు అమ్మమ్మ, తాతయ్య. దాంతో తను కూడా జావేద్ అంకుల్ లాగా పెద్ద కవి అవుతాననీ, పెద్దయ్యాక తన కోసం బోలెడు మంది రోజూ వస్తారని చెప్పటం మొదలెట్టాడు బిట్టూ. అమ్మమ్మ వాడికి మంచి స్నేహితురాలైపోయింది- కానీ తను కవిత్వం రాసినందుకు లెక్కల టీచరు ఏమందో మాత్రం అమ్మమ్మకి కూడా చెప్పలేదు వాడు!

***

తాతయ్య రోజూ ప్రొద్దున్నే కాస్సేపు సైకిల్ తొక్కుతుండేవారు. సైకిల్ మీద తాతయ్య, వెనుక తను కూర్చుని వెళ్లటం తెగ నచ్చేసింది బిట్టూకి. ఒకరోజున అట్లా సైకిల్

మీద ఒక రౌండ్ వేసి, పనిలో పనిగా కాసిని కూరలు తెద్దామని ఇద్దరూ బయలుదేరారు. ఆదివారం కనుక తొందరలేదు. 'ఇంకా దూరం! ఇంకా! ఇంకా!' అంటూ తాతయ్యని బాగానే సైకిల్ తొక్కించాడు బిట్టూ.



'అసలు తను కూడా సైకిల్ తొక్కటం నేర్చుకుంటే ఎంత బావుంటుంది?! తాతయ్యని అడగాలి!' అనుకున్నాడు కూడా. అయితే అంతలోనే సైకిల్ చెయిన్ తెగిపోయింది. ఇప్పుడిక తొక్కినా సైకిల్ కదలదు.

దాన్ని నెమ్మదిగా తోసుకుంటూ బిట్టుతో చెప్పారు తాతయ్య, విచారంగా- 'సైకిల్ కూడా నాలాగే పెద్దదైపోయిందిరా, బిట్టూ! ఓపిక తగ్గిపోయింది. నీకు నచ్చేట్టు ఎంతంటే అంత దూరం వెళ్ళటం ఇక కుదరదు, దీనితో' అని.

ఇద్దరూ అట్లా మాట్లాడుకుంటూ వీరబాబు సైకిల్ రిపేర్ షాప్‌కి చేరుకున్నారు. తాతయ్య అలవాటుగా వీరబాబు కోసం చూసారు- కానీ అక్కడ కొట్లో పెద్దవాళ్లెవరూ లేరు: వీరబాబు మనవడు- పద్నాలుగేళ్ల దావీదు- ఉన్నాడక్కడ. 'ఏం చెయ్యాలో చెప్పండి- మాతాత లేడు' అంటూ వచ్చి, సైకిల్‌కి అవసరమైన రిపేరు చేసేసేడు.

తాతయ్య పదిరూపాయలు ఇవ్వబోతే, 'ఇంత పనికి పదిరూపాయలా? ముందే చెబితే అసలు చేసే ఉండేవాణ్ణి కాదు! ఇరవై ఇవ్వండి!' అంటూ దురుసుగా మాట్లాడి, ఇరవై రూపాయలు తీసుకున్నాడు.

తాతయ్య కోపం తెచ్చుకోకుండా నవ్వుతూ డబ్బు ఇచ్చారు కానీ, బిట్టుకి మటుకు

దావీదు మీద చాలా కోపం వచ్చింది. ఇంటికొస్తూ దారిలో అడిగేసాడు- 'తాతయ్యా, ఆ అబ్బాయి అట్లా మాట్లాడితే నీకు కోపం రాలేదా?'అని.

'కోపం ఎందుకు బిట్టూ? వాడు పేదవాడు- ఇంకో పది రూపాయలు కావాలని అడిగాడు; అంతేగా?'

'మరి ఆ సంగతే వాడు మర్యాదగా అడగచ్చుగా? నువ్వు అలవాటుగా వెళ్లే దుకాణమే అది! అదీకాక, పెద్దవాళ్లను గౌరవించాలని కదా, అమ్మ చెప్పింది?!'

తాతయ్య చిన్నగా నవ్వారు. 'అవును- నిజమే, కానీ ఈ దావీదు కుర్రాడున్నాడే, వాడు ఈ మధ్యే కొత్తగా వచ్చాడు. ఇంకా మాట్లాడటం తెలియదు వాడికి; నేర్చుకుంటాడు. అయినా వాడి పని తీరు చూసావా? ఎంత చక్కగా చేసాడో చూడు! చాలా త్వరగా నేర్చుకున్నాడు! బలే చురుకైనవాడు' అంటూ వాడిని మెచ్చుకున్నారు.

తాతయ్య అట్లాంటి వాడిని మెచ్చుకుంటున్నారని బిట్టుకి దావీదు మీద ఇంకా కోపం వచ్చేసింది. వాడిమీద ఒక కవిత రాయాలని నిర్ణయించేసుకున్నాడు. ఈ- మధ్య బిట్టు తనకి ఎవరైనా నచ్చినా, లేదా ఎవరిమీదైనా కోపం వచ్చినా సరే, వాళ్ళమీద కవితలు రాసేస్తున్నాడు. ఆరోజు రాత్రి తన కవితల పుస్తకంలో ఇలా వ్రాసుకున్నాడు:

వీరబాబు మనవడు దావీదు,
సైకిల్ రిపేర్లన్నీ ఇట్టే చేసే దావీదు,
మర్యాద తెలియని దావీదు,
నాకు నచ్చలేదు దావీదు!

ఇక ఆ తర్వాతినుండీ తాతయ్యతో సైకిల్ రైడ్‌కి వెళ్లినా, వీరబాబు దుకాణం దగ్గరకి మటుకు వెళ్లేవాడు కాదు బిట్టు. గాలి కొట్టించేందుకు తాతయ్య అక్కడ ఆగినా, బిట్టు నాలుగు అడుగులు దూరంగా, అటు తిరిగి నిలబడేవాడు.

వీరబాబుకి ఇవేమీ తెలియదుగా, ఎంచక్కా 'ఏం బిట్టూ బాబూ, మా ఊరు నచ్చిందా?

మీకో సైకిల్ ఇమ్మంటారా, తొక్కుకుందుకు?'అంటూ పలకరించేవాడు. అతను అట్లా అడిగితే సైకిల్ నేర్చుకోవాలనిపించేది బిట్టూకి. అయినా మళ్ళీ 'అమ్మ-నాన్న ఏమంటారో?' అని అనుమానం వేసేది. "ఢిల్లీ వెళ్ళాక తనకి సైకిల్ కొనిస్తారా? అసలు తను సైకిల్ మీద ఎక్కడికి వెళ్లగలడు, ఆ నగరంలో? స్కూలుకేమో బస్సు ఉంది.. ఇంకెక్కడికి వెళ్లొచ్చు సైకిల్ మీద? ఊరికే ఇంటి దగ్గర తొక్కుదామంటే ఎక్కువ చోటు లేదు- అన్నీ అపార్టుమెంట్లు. చుట్టూ కార్లు పార్క్ చేసి ఉంటాయి.."

***

ఆ రోజు అమ్మమ్మ 'పని ఏమాత్రం తెమలటం లేదు- ఎందుకనో ఈ కమలమ్మ పనిలోకి రావటం లేదు, రెండు రోజులుగా' అనుకోవటం విన్నాడు బిట్టూ. అమ్మమ్మకి సాయం చెయ్యాలని ఉత్సాహపడ్డాడు- 'అమ్మమ్మా, నాకు చెప్పు, నేను చేస్తాను పని!' అడిగాడు ఆవిడని.

'నువ్వేం చేస్తావురా? ఇక్కడి పనులు వేరు- నీకు తెలీదులే' అన్నది అమ్మమ్మ.

బిట్టు ఊరుకోలేదు. 'నువ్వు చెప్పు; నేను ఎలా చేస్తానో చూడు' అంటూ సవాలు విసిరాడు. ఉతికిన చొక్కాలు, ప్యాంట్లు హ్యాంగర్లకి తగిలించబోతున్న అమ్మమ్మ, "కాస్త ఈ పని చేసిపెడతావా?" అని అడిగింది. వాడు సంతోషంగా పని అందుకున్నాడు.




పనిలోకి రాని ఈ కమలమ్మ అసలు దావీదు వాళ్ల అమ్మమ్మే! "దావీదు స్కూలుకి వెళ్లకుండా, చదువు లేకుండా, అల్లరిగా తిరుగుతూన్నాడు; మాట వినట్లేదు" అని వాళ్ళ అమ్మ తీసుకొచ్చి వాణ్ణి కమలమ్మ

దగ్గర వదిలిపెట్టి వెళ్లింది. ఇప్పుడు వాడు తాత వీరబాబు చేతికింద సాయంగా సైకిల్ షాపులో కూర్చుంటున్నాడు.

బిట్టు, అమ్మమ్మ బట్టలు ఆరేస్తుండగా వచ్చాడు దావీదు: 'మా అమ్మమ్మ ఇంకా రెండు రోజులు రాదండి. జ్వరంగా ఉంది' అని చెప్పేసి వెళ్లిపోబోయాడు. అమ్మమ్మ వాణ్ణి వెనక్కి పిలిచి 'ఒరే, కాస్త ఆగు! కొంచెం కూర, పులుసు ఇస్తాను.. ఇంతకీ అన్నం వండుకున్నారా లేదా?' అడిగింది అనుమానంగా.

'లేదండి, తాత కొట్లో ఉన్నాడు. అవ్వ రాదని మీకు చెప్పి రమ్మంటే, వచ్చాను.'

'ఉండు, మీ అమ్మమ్మ మందు వేసుకుందా? కాస్త నయం అయిందా? పోనీ మీ అమ్మని సాయంగా రమ్మని కబురంపలేకపోయారా?' అంటూనే వాడికోసం అన్నం, కూర, పులుసు క్యారేజీ గిన్నెల్లో సర్దింది అమ్మమ్మ.

'మా అమ్మ రాదండీ, మా నాన్న, ఆవిడ రోజూ పోట్లాడుకుందుకే సరిపోదండీ' అన్నాడు వాడు ఆరిందాలాగా.

అమ్మమ్మ క్యారేజీ చేతికిస్తే, వాడు 'వద్దండీ, బిరియానీ ప్యాకెట్టు తెచ్చిపెడతానన్నాడు తాత!' అన్నాడు నిర్లక్ష్యంగా.



'నీ మొహం! మీ అమ్మమ్మకి తగ్గేవరకు నేను ఇస్తాలే! రోజూ వచ్చి క్యారేజీ పట్టుకెళ్ళు!' అంటూ అమ్మమ్మే బలవంతంగా వాడికి క్యారేజీ అందించింది.

బిట్టు ఒకవైపున బట్టలు ఆరేస్తూనే మరో వైపున ఇదంతా గమనిస్తూ ఉన్నాడు. 'అమ్మమ్మా, దావీదు అలా మాట్లాడుతుంటే నువ్వు భోజనం ఎందుకు ఇస్తున్నావ్?

బిర్యానీ కొనుక్కుంటానన్నాడుగా?' అన్నాడు బుంగమూతి పెట్టి.

'కమలమ్మ-వీరబాబు మనకి ఎన్నో ఏళ్ళ పరిచయంరా, బిట్టూ; ఇద్దరూ చాలా మంచివాళ్ళు. కమలమ్మ సాధారణంగా పని మానదు; ఇంక వీరబాబేమో అక్కడ రిపేర్ షాపు పెట్టుకొని కూడా అవసరం ఉన్నప్పుడల్లా వచ్చి మన పెరట్లో తోటపని చేసి పెడుతుంటాడు. ఇప్పుడు పాపం కమలమ్మకి ఆరోగ్యం బాలేదు కదా; వాళ్లకి ఇంట్లో వంట చేసి పెట్టేవాళ్లు ఎవ్వరూ లేరు. ఏదో మనం వండుకున్నదే, ఒక రెండు రోజులు వాళ్లకీ ఇస్తే సరిపోతుంది. కమలమ్మ బాగైతే తనే చేసుకుంటుందిగా, మళ్ళీ?!' అంటూ తమ కోసం మళ్లీ అన్నం వండి పెట్టింది అమ్మమ్మ.

(ఇంకా ఉంది..)



## పొడుపు కథలు

1. అరిచేతి కింద అరిసె.
2. అరచేతిలో 60 నక్షత్రలు.
3. అరం కణం గదిలో 60 మంది నివాసం.
4. ఆకాశంలో 60 గదులు గదిగదికో సాపాయి, సిపాయికో తుపాకి.
5. ఆకాశంలో ఎగురు తుంది. పక్షి కాదు మనుషుల్ని ఎగరేసుకు పోతుంది గాలికాదు.
6. ఓ ఆకు..మర్రి..కాయ..మామిడికాయ పువ్వు మల్లె పువ్వు.
7. అనగనగా ఓ అప్సరస అమె పేరులో మద్య అక్షరం తీసేస్తే మేక.
8. ఓహోయి రాజా! ఒడ్డు పాడుగేని? పట్టుకోబోతే పిడికెడు లేవు.
9. కాళ్లు లేవు గాని నడుస్తుంది. కళ్లు లేవు గానీ ఏడుస్తుంది?.
10. తలపుల సందున మెరుపుల గిన్నె?.
11. తల్లి దయ్యం, పిల్ల పగడం?.
12. తెల్లకోటు తొడుక్కున్న ఎర్రముక్కు దొర?.

-అశోక్, సికెపల్లి.

జవాబులు : 1. పిడక, 2. జల్లెడ, 3. అగ్గిపెట్టె పుల్లలు, 4. తేనెపట్టు, 5. విమానం, 6. జిల్లేడు, 7. మేనక, 8. పొగ, 9. మేఘం, 10. దీపం, 11. రేగు పండు, 12. కొవ్వొత్తి




# చేజారిన అవకాశం

*సేకరణ: కె.రోహిత్,7 వ తరగతి, తేజ టాలెంట్ స్కూల్, కోదాడ.*

కృష్ణమోహన్ అనే కుర్రవాడికి ఒకసారి ఓ గ్రంథం దొరికింది- చాలా పురాతన కాలం నాటి తాళపత్ర గ్రంథం. దాని భాష ఏదో సగం అర్థమై, సగం కాకుండా ఉంది.

అందులో ఒక పేజీ ఆసక్తికరంగా అనిపించి, జాగ్రత్తగా చదివాడు: "గంగానది ఒడ్డున ఓ చోట సాధారణ నర సంచారం లేని ఓ ప్రాంతం ఉంది. వేల సంవత్సరాల క్రితం సమాధి నొందిన మహా ఋషులు కొందరు, అక్కడ ఓ గుహలో ఇంకా తపస్సు చేస్తూ ఉన్నారు. వాళ్ళు తపస్సు మొదలు పెట్టిన కొత్తల్లోనే, వాళ్ళ తపో ప్రభావం వల్ల, అక్కడి చిన్న రాయి ఒకటి పరసువేది ఐపోయింది. ఆ ఋషులు సర్వ సంగ పరిత్యాగులు. వాళ్ళకి దానితో ఏమీ ఉపయోగం కనిపించ లేదు. "మరి దీనితో ఏం చేద్దాం" అని ఆలోచించి, 'ప్రత్యేకంగా ఇది ఎవరికీ దొరకనక్కర్లేదు' అని దాన్ని కూడా మిగతా రాళ్లతో బాటు నది ఒడ్డున పడేసారు. కానీ ఆ రాయి సోకితే ఏ లోహమైనా బంగారంగా

మారిపోతుంది" అని రాసి ఉన్నది.

వెంటనే వివరాలలోకి పోయి చూసాడు కృష్ణమోహన్. గుర్తులన్నీ స్పష్టంగానే ఉన్నాయి. "బహుశ: తను వెళ్ళి వెతికితే దొరకచ్చు.. ఆ ఒక్క రాయి దొరికితే తన జీవితం మారిపోతుంది!" ఆత్రుతతో అతని ముఖం ఎర్రబడింది.



"మరి అన్ని రాళ్ళలో ఆ రాయిని గుర్తు పట్టేదెలాగ?" ఆ వివరం కూడా స్పష్టంగా రాసి ఉన్నది. "వణికించే చలికాలంలో కూడా వెచ్చని నిప్పు కణికలాగా కాలే రాయి ఏదైతే ఉందో అదే పరసువేది" అని!

ఇక ఆగలేకపోయాడు కృష్ణమోహన్. వెంటనే బయలుదేరి వారణాసి దగ్గర గంగాతీరం చేరుకున్నాడు. గంగ వెంబడే పడమటివైపుకు నడుస్తూపోతే, సాయంత్రంకల్లా అతని కాళ్ళు కాయలు కాచాయి. అయినా అట్లా నడుస్తూనే తనకు కావలసిన రాళ్ల కోసం వెతక సాగాడతను. అట్లా పోగా పోగా, పుస్తకంలో చెప్పిన ప్రాంతాలు కనిపించాయి చివరికి- సరిగ్గా పుస్తకంలో వివరించినట్లే ఉన్నాయవి! ఇక అక్కడే ఆగి, ఒడ్డున పడి ఉన్న ఒక్కొక్క రాయినీ ఎత్తి పట్టి పరిశీలిస్తూ పోయాడు కృష్ణమోహన్.

అట్లా వారం గడిచింది. రాళ్ళయితే అక్కడ అనంతంగా ఉన్నాయి. పరసువేది జాడే, లేదు. కృష్ణమోహన్‌కి చికాకు మొదలైంది. చూసిన రాయినే మళ్ళీ మళ్ళీ చూసే సరికి అతనికి తిక్కరేగింది. "ఇట్లా అయితే లాభం లేదు" అనుకున్నాడు. "ఒకసారి చూసిన రాయిని మళ్ళీ చూడ కూడదు. లేకపోతే ఇన్ని రాళ్ళు ఎప్పటికి పూర్తయేట్లు?"

ఇక ఆ క్షణం నుండీ అతను పరిశీలించిన రాయినల్లా అవతల ఉన్న లోయలోకి విసిరేయటం మొదలు పెట్టాడు. రాళ్ల

కుప్పలు తగ్గిపోతున్నకొద్దీ అతనికి ఆనందంగా అనిపించసాగింది.



అట్లా ఇంకొక వారం గడిచింది. తిండీ తిప్పలూ లేక అతనికి ఇప్పుడు తల తిరగటం మొదలైంది. దాహంతో నోరు పిడచకట్టుకుపోసాగింది.

ఒక్కో రాయిని పట్టుకొని చూసి, వెచ్చగా లేకుంటే దాన్ని కోపంతో లోయలోకి విసిరేస్తూ పోయాడతను. చివరికి రాళ్ళను విసిరెయ్యటం కూడా అతనికి ఓ అలవాటుగా మారింది: ఇప్పుడు అతని చెయ్యి యాంత్రికంగా రాయిని ఎత్తుతున్నది; లోయలోకి విసిరేస్తున్నది; మరొక రాయిని ఎత్తుతున్నది..

కొద్ది రోజుల తర్వాత అతనికి ఓ అనుమానం మొదలైంది: 'అప్పుడెప్పుడో తనకు కనిపించిన రాయి ఒకటి- చాలా వెచ్చగా ఉండింది కదా..! మరి అదే పరసువేది అయి ఉండచ్చునేమో..!' అని!

కానీ ఇప్పుడది దొరికే అవకాశం లేదు- లోయలోకి విసిరేసాడు కద! అట్లాగని, ఆ అనుమానాన్ని మనసులో మోస్తూ, అక్కడ ఒడ్డున వెతకాల్సిన పనీ చేయలేదు! జరగాల్సిన అనర్థం జరిగిపోయింది- ఇక తన బ్రతుకు మారదు!



**తమాషా!**

భార్య(విచారంగా): ఇవాళ్ల నాకు ఒంట్లో బాగో లేదండీ!

భర్త: అయ్యో, నేను నిన్ను షాపింగ్‌కి తీసుకెళ్దామనుకున్నానే!

భార్య: అరె! నేను తమాషాకి చెప్పానండీ! మరి వెళ్దామా?!

భర్త: నేనూ తమషాకే చెప్పా రమా! ఇంక లేచి వంట చెయ్యి!






# చదువుల తల్లి

*మీరు ప్రైవేటు బడిలో చదువుతారా? శ్రీకాంత్ రాసిన ఈ కథ మీకు నచ్చుతుంది చూడండి!*

*రచన:సాముల శ్రీకాంత్ రెడ్డి, పదవ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ, సూర్యపేట, తెలంగాణ రాష్ట్రం.*

పోరుబండలో సుధా విద్యాలయాన్ని నడిపే సోమప్పగారిది మంచి మనసు. తన బడిలో డబ్బున్న పిల్లలతో బాటు కొందరు పేద పిల్లల్ని కూడా, ఫీజు లేకుండా చేర్చుకునేవాడాయన. ఆ బడిలో సుప్రీత్ , జనార్ధన్ అనే ఇద్దరు పిల్లలు, బాగా చదివేవాళ్ళు. సుప్రీత్ బాగా డబ్బులు ఉన్న కుటుంబం వాడు; జనార్దన్ పేద కుటుంబంవాడు.

సుప్రీత్‌కు తెలివి తేటలతోబాటు, డబ్బులు తెచ్చిన అహంకారం కూడా బాగా ఉండేది. ఎప్పుడూ జనార్దన్‌ని "మీకు డబ్బు లేదురా! మా డబ్బున్న వాళ్ళ పక్కన కూర్చోకు!" అని వెటకరిస్తూ ఉండేవాడు. అయితే జనార్దన్‌కి చదువు మీద ఉన్న ఇష్టాన్ని ఏ అవమానాలూ తగ్గించలేక పోయాయి. వాడు మనసు పెట్టి చదివి, అన్ని పరీక్షలలోనూ సుప్రీత్‌కంటే ఎక్కువ మార్కులే తెచ్చుకునేవాడు;

పైపెచ్చు అందరితోటీ మర్యాదగా మెలిగేవాడు.

ఒకసారి సుప్రీత్ పుట్టిన రోజు వచ్చింది. ఆ రోజున వాడు క్లాసులో అందరికీ తినుబండారాలు పంచి, చాలా గొప్పగా పండుగ జరుపుకొన్నాడు.




కొన్ని రోజుల తరువాత జనార్దన్ పుట్టిన రోజు. వాడి దగ్గర డబ్బులు ఏమాత్రం లేవు. అయినా తమ టీచర్లు చెప్పిన దేశనాయకులని తలచుకొని, కథల్లో చదివినట్లు, తన పుట్టిన రోజు సందర్భంగా ఒక మొక్కని నాటి సంతోషపడ్డాడు వాడు.

వాళ్ళ బడిలో ఆటలు ఆడాలంటే "షూస్" తప్పకుండా ఉండాలి. డబ్బులున్న పిల్లలంతా "షూస్" కొనుక్కున్నారు. కానీ జనార్ధన్‌కి అవి ఎక్కడినుండి వస్తాయి? వాళ్ళ అమ్మ-నాన్న ఇద్దరూ కూలి పని చేసుకొని బ్రతుకుతారు. ఒక్క రోజున కూలికి వెళ్ళకపోయినా పూటగడవదు. దాంతో వాడు ఆలోచించి, స్కూల్లో ఎవరో పారేసిన పాడైపోయిన "షూస్"ని తీసుకెళ్ళి, సొంతగా రిపేరు చేసుకొని వేసుకున్నాడు. అది చూసిన సుప్రీత్, ఇతర పిల్లలు వాడిని ఒకటే ఆట పట్టించారు. అయినా జనార్దన్ పట్టువదలకుండా ఆడి, పెద్దలందరినీ మెప్పించాడు.

ఆ రోజుల్లో జనార్దన్‌కి వ్యాపారం చేయాలని ఉండేది. సోమప్పగారు వాడిని అడిగారు ఒకసారి- "జనార్దన్! నువ్వు పెద్దయినాక ఎవరవుతావు?" అని. "సార్! నేను సుప్రీత్ వాళ్ళ నాన్న మాదిరి గొప్ప వ్యాపారిని అవుతాను సార్!" టక్కున జవాబిచ్చాడు జనార్దన్.

"ఎందుకు, అట్లా ఎందుకు

అనుకుంటున్నావు?" అడిగారు సోమప్ప, ఆశ్చర్యంగా.

"వ్యాపారి ఐతే డబ్బులు బాగా సంపాదించచ్చు సార్; హాయిగా బ్రతకచ్చు; మీలాగా పదిమందికి సాయం కూడా చేయచ్చు" చెప్పాడు జనార్దన్.

ఆయన నవ్వి "బాగుందిరా. అయినా నేనో సంగతి చెబుతాను వింటావా? నీలాంటి తెలివైన మంచి పిల్లలు ఊరికే పది మందికి సాయం చేయటంతో ఆగిపోకూడదు- ఉన్నత ఉద్యోగాలమీద దృష్టి పెట్టి, ఏ కలెక్టర్లో అయి, వందలాది మందికి దిశానిర్దేశం చేయాలి. లక్ష్యాలంటూ ఉంటే అవి సమున్నతంగా ఉండాలి. వాటికోసం నిరంతరంగా కృషి చేయాలి. నువ్వు ముందు చక్కగా రాయటం సాధన చెయ్యి. మన దేశంలోనూ, బయటా ఏం జరుగుతున్నాయో తెలుసుకుంటూ ఉండు. రోజూ కనీసం ఒక అరగంటసేపు వార్తాపత్రికలు చదువు" అన్నాడు.

ఆయన మాటలు జనార్దన్ మనసులో చెరగని ముద్ర వేసాయి. ఇక ఆరోజునుండి వాడు సమయాన్ని ఇంకా చక్కగా వినియోగించుకున్నాడు.




రోజూ ఉదయాన్నే పేపరు వేస్తూ అలా పాఠ్య పుస్తకాలతోబాటు పేపరు కూడా చదివే అలవాటు చేసుకున్నాడు.

వ్యాసాలు చదవటం, సొంతగా రాయటం, వక్తృత్వ పోటీల్లో పాల్గొనటం మొదలు పెట్టాడు. చక్కని మార్కులతో పదవ తరగతి పాసయ్యాడు.

వాడు ఇంటర్మీడియట్లో ఉండగా వాళ్ళ నాన్నకి జబ్బుచేసి చనిపోయాడు. అటుపైన జనార్దన్ ప్రొద్దునంతా చదువుకొని, రాత్రిపూట హోటల్లో పనిచేసాడు. ఆ

డబ్బులతోటే ఇల్లు నడిపాడు; చెల్లినీ చదివించాడు.



ఎన్ని కష్టాలొచ్చినా తన లక్ష్యాన్ని మరచిపోని జనార్దన్ చివరికి సివిల్ సర్వీసెస్ పరీక్ష రాసి, ఐయేయస్ అధికారి అయ్యాడు.

ఎన్ని పదవులు అధిరోహించినా తన మూలాల్ని మర్చిపోలేదు జనార్దన్. నిజాయితీ, కార్యశుద్ధి గల అధికారిగాను, దయగల మంచి మనిషిగాను పేరుతెచ్చుకున్నాడు.

తనలాగా కష్టాల్లో ఉన్న వందలాది మందికి సరైన దారి చూపిస్తూ వచ్చాడు. వ్యాపారంలోను, ఇతర రంగాలలోను రాణించి కూడా స్వార్థ చింతనలోంచి బయటికి రాలేని మిత్రుల్ని చూసినప్పుడల్లా సోమప్పగారు చెప్పింది గుర్తు చేసుకునేవాడు జనార్దన్: "డబ్బు సుఖాన్ని మాత్రమే ఇస్తుంది. కానీ చదువుల తల్లి మనకు మంచితనాన్ని ఇచ్చి, పదిమందికి సాయపడేలా చేస్తుంది" అని.



**అంటించుకుందాం రా!**

తండ్రి: కాగితాలు అంటించుకోవాలి. కాస్త ఆ జిగురు ఇలా తెచ్చిపెట్టు చిన్నూ!

చిన్ను: దానికి జిగురెందుకు నాన్నా! నీ దగ్గర అగ్గిపెట్టె ఉందిగా?!

తండ్రి: ఆ ???!!!



**ఆకలి న్యూటన్!**

రాజేష్: ఆపిల్ పండు కింద పడగానే, ' క్రిందికే ఎందుకు పడింది?' అని ఆలోచించాడు. మరి నువ్వైతే ఏం చేసేవాడివి?

గిరీష్: మొదటిది పడగానే తినేసి, 'రెండోది ఎప్పుడు పడుతుందా' అని చూసేవాడిని!

# వెంగళ్ సేనాని

బొమ్మల జానపద కథ

*సేకరణ: వివేకానంద, ఐదవ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*




అనగనగా ఒక రోజు రాత్రి వాన పడింది. ఆ వానలో ఒక పులి తడిసి ముద్దై, వణుక్కుంటూ ఒక ఇంటి దగ్గరకు వచ్చింది.

అప్పట్లో వెంగళప్ప ఒక చాకలిగా ఉండేవాడు.

తాగి ఉన్న వెంగళప్ప ఆ పులిని చూసి తన గాడిదే అనుకున్నాడు. "నువ్వు ఇక్కడున్నావా, నీకోసం నేను ఊరంతా తిరిగానే!" అని దాన్ని తిట్టి, చెవి పట్టుకుని  ఇంటికి లాక్కెళ్ళాడు.

అసలే సగం చచ్చి ఉన్నది పులి. దానికి తిరగబడేంత శక్తి కూడా లేదు.

ఇంకేమీ చెయ్యలేక అది నోరు మూసుకొని వాడి వెంట వెళ్ళి, గాడిద స్థానంలో కూర్చున్నది.



తెల్లవారు జామున వెంగళప్ప భార్య తలుపు తెరిచి, గాడిద స్థానంలో కూర్చొని ఉన్న పులిని చూసి, భయంతో కేకలు వేసింది.




వెంగళప్పని లేపి, "పులిని కట్టేసావేంటి?" అని అడిగింది. రాజ భటులకు, జంతుశాఖ వారికి కబురు వెళ్ళింది. వాళ్ళు వచ్చి పులిని బంధించి తీసుకెళ్ళారు.

అంతలో రాజుగారికి మన వెంగళప్పని చూస్తే ముద్దు వేసింది.




"అంత పెద్ద పులిని ఆయుధం లేకుండా పట్టుకొచ్చాడు! ఇక వాడి దగ్గరే ఆయుధం ఉంటే, ఇంక ఎదురేముంటుంది?!" అనుకున్నాడు. వెంటనే వెంగళ్ని తన సేనాధిపతిగా చేసుకున్నాడు.

ఐదు రోజులకే శత్రువులు పెద్ద సైన్యం వెంటపెట్టుకొని యుద్ధానికి వచ్చారు. రాజుగారు కులాసాగా నవ్వి, "మా సేనాధిపతి ఒక్కడే చాలు- వాళ్లందరికీ బుద్ధి చెప్పేందుకు!" అని వెంగళప్పకి ఓ గుర్రం ఇచ్చి, దీవించి, "ఇకపోయి, విజయంతో తిరిగి రా!" అని పంపించేసాడు.




వెంగళప్పకేమో, మరి, గుర్రం ఎక్కటం కూడా రాదు. నానా కష్టాలు పడి, చివరికి ఎట్లాగో వెనక్కు తిరిగి ఎక్కి, కళ్ళు మూసుకొని, కళ్ళెం గట్టిగా పట్టుకొని కూర్చున్నాడు. గుర్రం తన అలవాటు కొద్దీ యుద్ధరంగం వైపుకు పరుగు తీసింది.

కళ్ళు తెరిచిన సేనాపతి ఇప్పుడు దాన్ని ఆపేందుకు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అంతలో అది ఒక తాడిచెట్టు క్రిందుగా వెళ్ళింది. ధైర్యం తెచ్చుకున్న వెంగళ్ గుర్రం మీది నుండి తాటి చెట్టు మీదికి దూకి, దాన్ని కౌగలించుకున్నాడు. ఆ అదురుకి తాటిచెట్టు ఊగటం, దాని పైనున్న కల్లుకుండ ఒకటి జారి గుర్రం తలమీద పడటం అకస్మాత్తుగా జరిగిపోయాయి. కళ్ళు కనపడని గుర్రం గిరగిరా తిరుగుకుంటూ శబ్దం ఎటు వినబడితే అటు దూక్కుంటూ పోయింది.

శత్రువులు దాన్ని చూసి జడుసుకున్నారు. "రాక్షసుడురోయ్! పారిపోండి!" అని చెల్లా చెదరైపోయారు.

నడుచుకుంటూ వెనక్కి తిరిగొస్తున్న సేనాపతిని చూసి ఊళ్ళోవాళ్లంతా పూలవర్షం కురిపించారు.

కానీ ఆ సరికి బుద్ధి వచ్చిన వెంగళప్ప రాజుగారికి దండం పెట్టి, ఏం జరిగిందో వివరిస్తుంటే సభలో వాళ్లంతా కడుపుబ్బ నవ్వారు.




"ఆ శత్రువులెవరో పిరికివాళ్ళు కాబట్టి సరిపోయింది- లేకపోతే ఇంకేమీ ఉండకపోవును! నాకు ఇంక ఈ పని వద్దు ప్రభూ! నన్ను వదిలేస్తే వెళ్లి బుద్ధిగా నా చాకలి పని నేను చేసుకుంటాను" అని ప్రాధేయపడ్డాడు వెంగళప్ప!

అర్థం చేసుకున్న రాజుగారు కూడా నవ్వుతూ సరేనన్నారు! 

స్వాగతం!

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !




# దారిలో దయ్యం-నాకేం భయం

*రచన : ఉప్పర కీర్తి, 6 వతరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర, రొద్దం మండలం, అనంతపురం.*
*మార్పు చేర్పులు : కొత్తపల్లి*

లోచర్లలో ఉండే చందు ఇప్పుడిప్పుడే ఆరో తరగతికి వచ్చాడు. వాళ్ల ఊరులో హైస్కూలు లేదు. అందుకని రొద్దం బడిలో చేరాడు.

లోచర్ల నుండి రొద్దానికి పన్నెండు కిలోమీటర్లు. రోజుకు నాలుగుసార్లు అటూ ఇటూ తిరిగే బస్సొకటి ఆ ఊరి జనాలను, మిగతా ప్రపంచంతో కలుపుతుండేది.

లోచర్ల పిల్లలు ఓ నలుగురు కలిసి, బస్సులో రొద్దం బడికి వెళ్ళి వస్తుండేవాళ్ళు ప్రతిరోజూ. పెద్దవాళ్లెవరూ వెంట లేకుండా తాము పిల్లలమే అట్లా వెళ్ళటం వింతగానూ, కొంచెం భయంగానూ ఉండేది వాళ్లకు. అంతే కాక రొద్దం చుట్టుప్రక్కల అంతా చిన్నపాటి గుట్టలూ, నిర్మానుష్యంగా ఉండే ప్రాంతాలూ చాలా ఉండేవి. బస్సులు రాకపోయినా, ఏ కారణం చేతైనా రద్దైనా పిల్లలు ఊరికి నడిచి రావాల్సి వచ్చేది. నడిచి వచ్చేసరికి రాత్రి బాగా

చీకటి పడిపోయేది కూడా.

అట్లాంటప్పుడు సాధారణంగా పిల్లలకందరికీ దయ్యాలు గుర్తుకొచ్చేవి. వాళ్ళలో ఎవ్వరేగానీ దయ్యాల్ని ఎప్పుడూ చూడలేదు- అయినా అందరికీ అవంటే చాలానే భయం ఉండేది.

అయితే స్వతహాగా చాలా తెలివీ, ధైర్యమూ, ఆత్మవిశ్వాసమూ ఉన్న చందుకు మటుకు "కనీసం ఒక్క దయ్యాన్నైనా దగ్గరగా చూడాలి; దానితో మాట్లాడాలి; దాన్ని ముట్టుకోవాలి" అని విపరీతమైన కోరిక ఉండేది. చాలా సార్లు ఆ సంగతిని వాడు మిగిలిన పిల్లలకు చెప్పి ఉన్నాడు కూడా.

ఒకసారి బడినుండి పిల్లలంతా ఇంటికి వస్తుండగా, దారిలో బస్సు టైరు పంక్చర్ అయ్యింది. ఆ సమయానికి బస్సులో ఎక్కువమంది లేరు. డ్రైవరు, కండక్టరు బస్సును అక్కడే ఆపేసి, "మీరంతా ఊరికి నడిచి వెళ్ళిపోండి" అని చెప్పేసారు. బస్సులో ఉన్నవాళ్లంతా దిగి చకచకా నడక మొదలెట్టారు. ఒక ఐదు నిముషాల తర్వాత చూస్తే ఈ పిల్లల కనుచూపు మేరలో అంతా నిర్మానుష్యం! చుట్టూ అలుముకుంటున్న చీకటి...

వీరుగాడు ఓ దయ్యం గురించి చెప్పటం మొదలు పెట్టాడు. అది తెల్లగా ఉంటుందిట, మబ్బులాగా. దాని నోట్లో రెండు నాలుకలు ఉంటాయట. పిల్లలంతా ఒకవైపున వణికి పోతూనే మరోవైపున ఆసక్తిగా వింటూ నడుస్తున్నారు. మెల్లగా వెన్నెల కాయటం మొదలైంది.




అంతలో వాళ్ళకు ఓ ముసలమ్మ కనిపించింది. ఓ కట్టె పట్టుకొని నడుస్తున్నది. తను కూడా లోచర్ల వైపే పోతున్నది. తెల్ల బట్టలు వేసుకొని, జుట్టు విరబోసుకొని ఉన్నది.

పిల్లలు ఆమెను దాటుకొని పోబోతుండగా అడిగింది: బాబులూ! చీకటి పడినట్లున్నది. నాకు చూపు సరిగ్గా ఆనదు. కొంచెం మా ఇంటి వరకూ నాతో పాటు తోడుగా వస్తారా నాయనా?" అని.



చందు ఆమె దగ్గరికి వెళ్ళి, "ఎక్కడవ్వా, మీ ఇల్లు?" అని అడిగాడు.

"దగ్గరికి వచ్చేసాం బాబూ. అదిగో ఆ అక్కడ కనిపించేది మాదే" అన్నది అవ్వ ఓ వైపు చూపిస్తూ.

చూస్తే అది ఏమంత దగ్గర అనిపించలేదు. పిల్లలంతా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. చందూ ఆమెతో "సరే పద అవ్వా! నేను వస్తాను నీతో; వీళ్లందరినీ ఇంటికి పొమ్మందాం" అని ఆమె వెంట బయలుదేరాడు. మిగిలిన పిల్లలంతా ఒకసారి వాడికేసి జాలిగా చూసి, తమ నడక వేగం పెంచారు.

అవ్వ వాడిని ఏవేవో వంకర దారుల గుండా తీసుకెళ్ళింది. "ఇంకా ఎంత దూరం అవ్వా?" అంటే, "ఇదిగో- ఇక్కడే" అంటున్నది. చివరికి వాళ్ళిద్దరూ ఓ స్మశానంలోకి ప్రవేశించారు.

చందుకి వణుకు వచ్చినట్లు అయ్యింది. "ఏంటీ?! మీ ఇల్లు ఇక్కడా?!" అని అడిగాడు వణుకుతున్న గొంతుతో.

"అవును బాబూ! మేమూ, మా పిల్లలూ అందరం ఉండేది ఇక్కడే. బాగా లేదా?" సన్నగా నవ్వింది అవ్వ.

"అంటే... అంటే.. మీరు దయ్యాలా?!" అరిచాడు చందు, ఎర్రబడిన ముఖంతో.

"కాదు బాబూ! అయితే ఇట్లా రాత్రివేళల్లో మమ్మల్ని చూసినవాళ్ళు అందరూ అట్లానే అనుకుంటారు. నిజానికి మేం ఈ ప్రాంతం

మొత్తానికీ కావలి వాళ్ళం. మిగతా వాళ్ళందరూ భయపడుతూ దూరం ఉండే ఈ ప్రదేశంలోనే మేం నిర్భయంగా తిరుగులాడతాం. తిరిగి తిరిగి ముసలివాళ్లం అవుతాం ఇట్లాగ!" నవ్వింది అవ్వ.

"మరి మీ భోజనమూ, అదీ?!" అడిగాడు చందూ, అనుమానంగా.

"ఏవో దొరికిన పక్షుల్నీ, జంతువుల్నీ తింటాం. అడవిలో దొరికే వెదురుబియ్యం, దుంపలు పళ్ళు వండుకుంటాం" చెప్పింది అవ్వ.

"మరి ఇక్కడి దయ్యాలు మిమ్మల్నేమీ చెయ్యవా?!" అడిగాడు చందు.

అవ్వ కిసకిసా నవ్వింది. "దయ్యాలు ఎక్కడున్నై బాబూ?! లేవు! మాలాంటి వాళ్లనే మీవాళ్ళు 'దయ్యాలు' అని చెప్పుకుంటూ, వాళ్ళు భయపడుతున్నారు; మమ్మల్ని దూరం పెట్టి చిన్నబుచ్చుతున్నారు" అంది అవ్వ.

ఆమె ధన్యవాదాలు అందుకొని, చందూ ఇంటికి బయలు దేరాడు. ఆలోచించినకొద్దీ వాడికి ఆశ్చర్యం వేసింది: "నిజమేనా? వీళ్లంతా మనుషులేనా? దయ్యాలు లేవా, అసలు?!" అని.

అయితే గాలికి ఊగుతూ చెట్లు విడుస్తున్న వెన్నెల నీడలు ఇప్పుడింక తనని భయపెట్టటం మానేసాయని వాడు గమనించలేదు. కదిలే ఆ నీడలు చాలా అందంగా ఉన్నాయనిపిస్తున్నది వాడికి! ఇక ఆ తర్వాత వాడికి చీకటంటే భయం పూర్తిగా పోయింది కూడా!



**పొడుపు కథలు:**

1. ఆకలేయదు, నీరు తాగదు, నేలన పాకదు, ఏమిటి ఆ తీగ ?!
2. ఏ వీధి రాజుకి కొప్పుంది; జుట్టు లేదు! కళ్ళున్నాయి, చూపులేదు?
3. అర చేతిలో అద్దం ఆరు నెలల యుద్ధం.
4. ఈత చెట్టుకి ఇద్దరు బిడ్డలు.
5. దాస్తే పిడికిలో దాగుతుంది. తీస్తే ఇల్లంతా పాకుతుంది. ఏంటది?

జవాబులు: 1. విద్యుత్తు తీగ, 2. కొబ్బరి కాయ, 3. గోరింటాకు 4. కల్లు కుండలు, 5. దీపం వెలుతురు

*-రామచంద్ర, 10A, సికెపల్లి*




# భావి పౌరులు

*రచన: రాధిక, 8 వ తరగతి, జహీరాబాద్, తెలంగాణ రాష్ట్రం.*

అనగా అనగా ఒక గుడిలాంటి బడి. ఒకసారి ఆ బడికి ఆరు రోజులు సెలవు వచ్చాయి. తెలుగు ఉపాధ్యాయులవారు పిల్లలకు ఒక నియోజనం (అసైన్‌మెంట్) ఇచ్చారు. అదేమిటంటే, ఆ ఆరు రోజుల కాలంలోనూ తాము గ్రహించిన ఆరు మంచి విషయాలను గురించి విద్యార్థులు తమ సొంత మాటల్లో రాసుకుని రావాలి.

పిల్లలంతా సెలవల్లో తమ తమ ఊళ్ళకు వెళ్ళారు. అందరూ సెలవల్ని ఎంత హాయిగా గడిపారంటే, ఆ సంతోషంలో ఒక్కరికి కూడా తెలుగు నియోజనం సంగతి గుర్తుకు రాలేదు.

ఏడవ రోజున సెలవలు ముగిసేసరికి పాఠశాలకు చేరుకున్నారంతా. మొదటి పీరియడ్ లోనే తెలుగు.

తెలుగు మాస్టరు గారు తరగతిలోకి అడుగు పెట్టీ పెట్టగానే "నియోజనం చేసుకువచ్చారుగా, అందరూ?!" అని అడిగారు.

పిల్లలంతా నాలుకలు కొరుక్కున్నారు. తలలు దించుకున్నారు. "సెలవుల్లో  పడి ఆ విషయమే మర్చిపోయామండి- ఆరు విషయాలు కాదు; ఒక్క విషయం కూడా రాసుకు రాలేదు" అని గొణిగారు.

"పోనీలే, పర్లేదు. ఒక్కొక్కరూ మీరు గమనించిన ఆరు సంగతులు చెప్పండి. దేని నుండి ఏమి నేర్చుకున్నారో చెబితే చాలు- ఇప్పుడింక ఏమీ రాయనక్కర్లేదు" అన్నారు తెలుగు ఉపాధ్యాయులవారు.

పిల్లలెవ్వరూ నోరెత్తలేదు. "ఆరు విషయాలంటే ఏంటి?" అని ఆలోచనలో పడ్డారు అందరూ.

ఉపాధ్యాయుడు విజయ్ వైపు చూసి "విజయ్! ఏదీ, ఈ సెలవల్లో నువ్వు గమనించి నేర్చుకున్న ఆరు సంగతులను వివరించు!" అన్నారు.

విజయ్ లేచి నిలబడి, "గురువు గారూ! నేను సెలవల్లో  ఆ ఆరు విషయాలను గూర్చి ఏమీ ఆలోచించలేదండి. కాని నేను ఇవాళ్ళ బడికి వచ్చేటప్పుడు గమనించిన వాటిలో ఆరు సంగతులు చెప్తాను" అన్నాడు.



తెలుగు ఉపాధ్యాయులవారు చాలా సంతోషించారు: "ఏదీ?! వివరించు నాయనా!" అన్నాడు.

"నేను ఇవాళ్ళ బడికి వస్తూంటే దారిలో కొన్ని చీమలు కనిపించాయి; కొన్ని చెట్లు కనిపించాయి; నేను భూమిని చూసాను; మరి ఇంకా చాలా పూలు కనిపించాయి; ఆకాశంలో సూర్యుడు ఉన్నాడు; ఇంకా నేను 'కాలం' గురించి కూడా ఆలోచించానివాళ్ళ" చెప్పాడు

విజయ్, వేళ్ళు మడిచి లెక్క పెట్టుకుంటూ.

"ఓహో! బాగుంది! అయితే ఆ ఆరింటి నుండీ నువ్వు ఏమేం సంగతులు గ్రహించావు?" అడిగారు తెలుగు మాస్టారు ఉత్సాహంగా.



"బడికి నడిచి వస్తుంటే నాకొక చీమల గుంపు కనిపించింది. అవన్నీ ఎంత క్రమశిక్షణతో ఒక దాని వెంట ఒకటి నడుచుకుంటూ పుట్టలోకి పోతున్నాయంటే, నేను వాటినే గమనిస్తూ కొంత సేపు నిల్చుండి పోయాను. "మనుషులకు కూడా ఈ చీమలకు ఉన్నంత క్రమశిక్షణ ఉంటే ఎంత బాగుంటుంది, ప్రతిదానికీ గుంపులు గుంపులుగా నెట్టుకొని తోసుకోకుండా?!" అనుకున్నాను.

తర్వాత నాకొక పండ్ల చెట్టు కనిపించింది ఒక ఇంట్లో. దానినిండా పుష్కలంగా పండ్లు ఉన్నై. ఆ పండ్ల బరువుకో, మరేమో- చెట్టు బాగా వంగిపోయి ఉన్నది. దాన్ని చూస్తే "ఎంత సంపదలున్నా, మనం కూడా ఈ చెట్టు మాదిరి వినయంగా వంగి నిలబడాలి" అనిపించింది.

అట్లా నడుస్తుంటే నాకు బీడుగా ఉన్న భూమి కనిపించింది, ఆ ప్రక్కనే పచ్చటి పొలం, అవతల ఒక అడవి, కొండలు కనిపించాయి.



దాన్నంతా చూస్తుంటే "ఈ భూమి ఎంత గొప్పదో కదా?! ఇంతింత బరువును, ప్రకృతిలోని ఇన్నిన్ని అంశాలను మోస్తూ కూడా

ఏమాత్రం చలించట్లేదు! మనం కూడా ఈ భూమిలాగా ఎంత బరువునైనా మోసేంత సహనం అలవర్చుకోవాలి" అనిపించింది.



దారిలో నాకు వికసించి నవ్వుతూన్న పూలు చాలా కనిపించాయి. "అరే, ఈ పూలన్నీ కేవలం ఒక్క రోజు మాత్రమే కదా, బ్రతికేది? అయినా అవి ఎంత హాయిగా విరబూసి నవ్వుతూన్నాయో చూడు! మనం కూడా ఎన్నాళ్ళు బ్రతికినా ఒకరికొకరం సహాయం చేసుకుంటూ, నవ్వుతూ బ్రతకాలి" అనిపించింది వాటిని చూస్తే.

అంతలో అనుకోకుండా సూర్యుణ్ణి చూసాను. "సూర్యుడు వీటన్నిటికీ వెలుగులు పంచుతున్నాడు కదా, తనకు తాను ఏమి ఆశిస్తున్నాడు? మనం కూడా పదిమందికి సహాయం చేయాలి- తిరిగి ఏమీ ఆశించకూడదు" అనుకున్నానప్పుడు.

"కాలం గురించి చెప్పలేదు- " అన్నారు తెలుగు ఉపాధ్యాయులు, ముచ్చట పడుతూ.

"అదే సర్, కాలం అలుపు లేకుండా పరుగెత్తుతున్నది. అందువల్లనే కదా, సూర్యోదయం సూర్యాస్తమయం అన్నీ వస్తున్నాయి? మనిషి కూడా కాలం మాదిరి అలుపెరగకుండా తన కర్తవ్యాన్ని నిర్వహించాలి" అన్నాడు విజయ్.



ఇదంతా విని గురువుగారు విజయ్‌ని దగ్గరకు తీసుకొని, "పిల్లలు తమ చుట్టూ ఉన్న విషయాల్లోంచి ఇన్నిన్ని గొప్ప సంగతులు నేర్చుకుంటుంటే ఇక పెద్దవాళ్ళకు అంతకంటే కావలసింది ఏముంటుంది? మన దేశానికే కాదు, ఈ ప్రపంచం మొత్తానికీ వన్నె తెచ్చే అద్భుతమైన వ్యక్తులు మీరు. భావి ప్రపంచ పౌరులు!" అన్నారు సంతోషంగా.

**కృతజ్ఞతలు!**

ఐదేళ్లలో పేపరు ధర, ప్రింటు వ్యయాలు ఎంత పెరిగినా పాతరేట్లకే కొత్తపల్లిని ప్రింటు చేసి పెడుతూ, ఆ బరువు మాకు ఏ మాత్రం తెలీకుండా మాయ చేస్తూ వస్తున్న ముద్రిక ప్రింటర్స్ కృపాకరరావుగారి ఆత్మీయతకు ధన్యవాద శతాలు.

నాలుగేళ్ల క్రితం మొదలు పెట్టి, కళాకారుల కోసమని ప్రతి నెలా ఎనిమిది వేల రూపాయలు పారితోషికంగా పంపుతున్న రాధ- రాజశేఖర్ గార్లకు, తాతగారు పిడూరి కృష్ణమూర్తి గారికి కృతజ్ఞతా పూర్వక వందనాలు. దాదాపు అదే సమయంలో 'నా శక్తి కొద్దీ ఇస్తున్నాను' అంటూ నెలకు ఐదు వందల రూపాయలు పంపటంతో మొదలు పెట్టి, తర్వాత దాన్ని పెంచి నెలకు వెయ్యి రూపాయలు చేసిన శ్రేయోభిలాషి, శ్రీమతి అరుణ మంతెన గారికి నమస్సులు.

'కుదరదు ఇప్పుడెవరైనా పెద్ద ఆర్డరు ఇవ్వాల్సిందే' అనుకున్నప్పుడల్లా, ఎవరో చెప్పినట్లే పెద్ద మొత్తంలో కొత్తపల్లులు ఆర్డరు చేసి చదివే పిల్లలున్న బడులకు వాటిని పంపిస్తున్న బ్రెడ్ సొసైటీ రామ్మోహనరావు గారికి, శారదగారికి కృతజ్ఞతలు.

ఏనెల కానెల డబ్బులు సర్ది సవరించుకొస్తున్న 'సత్యఫౌండేషన్, చెన్నూరు' వారికి, తాతయ్య బాల్ రెడ్డి గారికి, పెద్దలు ఉపేంద్ర శర్మ గారికి ధన్యవాదాలు.

రెండు జీవిత చందాలకుగాను పదివేల రూపాయలు పంపి, అడ్రసులు ఇవ్వమరచిన ఫేస్బుక్ మిత్రులు బాబీ సత్తిరాజు గారికి, జీవిత చందాగా 5000 రూ.లు పంపిన మిత్రులు ప్రశాంత్, హైదరాబాదు గారికి, సన్నిహిత మిత్రులు మంచిపుస్తకం సురేష్-భాగ్యలకు కృతజ్ఞతా పూర్వక వందనాలు.

మీరందరూ అనుకోవటం వల్లనే కొత్తపల్లి కథల పుస్తకం ఇంకా వెలువడుతూ ఉన్నది! ధన్యవాదాలు!!



# కాకి-చిలుక-పిచ్చుకల కథ

బొమ్మల కథ

*రచన: సోహిత్, ఐదవ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*

అనగనగా ఒక అడవిలో ఒక కాకి, పిచ్చుక, చిలుక ఉండేవి. కాకి, పిచ్చుక చాలా మంచి స్నేహితులు- కానీ చిలుక మాత్రం కాకిని చూసి ఊరికే అసహ్యించుకుంటూ ఉండేది.



ఒకరోజు కాకి, పిచ్చుక రెండూ ఎందుకనో చాలా వాదించుకున్నాయి. చిలుక ముందుకొచ్చి, కాకిని మరింత తిట్టి, పిచ్చుకను వెంటబెట్టుకొని పోయింది.

అయితే అదే రోజున నక్క ఒకటి,

చిలుకని తినేద్దామని పథకం వేసింది. "చిలుక పడుకున్న సమయం చూసుకొని, మెల్లగా- చప్పుడు కాకుండా- చెట్టు ఎక్కి దాన్ని తినేస్తా" అని ప్లాన్ చేసింది.



ఆ రోజు రాత్రి చిలుక పడుకోగానే నక్క వచ్చి, గుట్టు చప్పుడు కాకుండా చెట్టెక్కబోయింది. అయితే అక్కడే ఉన్న కాకి దాన్ని చూసింది. ఇంకేముంది? ఒక్క సారిగా నక్క మీదికి దూకింది- ఎక్కడ పడితే అక్కడ పొడవటం మొదలు పెట్టింది.



కాకి ధాటికి తట్టుకోలేని నక్క మూలుగుతూ పోరాటం మొదలు పెట్టింది. వాటి ఆ అరుపులకి మేల్కొన్నది చిలుక. తన చుట్టూ ఏం జరుగుతున్నదో చూసి, అది గబగబా లేచి ఎగిరిపోయింది. అటు నక్క కూడా 'బ్రతుకు జీవుడా' అని తోచిన దారిన పరుగు పెట్టింది. ఇప్పుడు చిలుక చాలా మారిపోయింది. కాకి మంచితనాన్ని అర్థం చేసుకున్నది. దానికి ధన్యవాదాలు చెప్పింది.

అప్పటి నుంచి కాకి-చిలుక-పిచ్చుక మూడూ మంచి స్నేహితులైపోయాయి.



# కుదిరిన స్నేహం

*రచన : 2 వ తరగతి 'B' గ్రూపు పిల్లలు, రాధ స్కూల్ ఆఫ్ లెర్నింగ్, అనంతపురం.*

ఊరి చివరన కొలను ఒకటి ఉండేది. కొలనులో బాతు, కొంగ స్నేహంగా ఉండేవి.

కొలనులో నీళ్ళు త్రాగేందుకు ఒక సింహం అక్కడికి వచ్చేది, రోజూ. దానికి బాతుని, కొంగని చూస్తే చాలా సంతోషం వేసేది. "ఎట్లాగైనా వీటితో స్నేహం చేయాలి" అనుకునేది.

చివరికి ఒక రోజున సింహం వాటి దగ్గరికి వెళ్ళి అడిగింది- "మీతో స్నేహం చేద్దామని ఉంది నాకు" అని. బాతు వెంటనే "మేం నీళ్లలో జీవిస్తాము; నువ్వేమో నీళ్ళ బయట ఉంటావు; ఇక మనకి స్నేహం ఎట్లా కుదురుతుంది?" అనేసింది.

సింహం నిరాశతో వెనక్కి తిరిగింది. ఆలోచిస్తూ మెల్లగా వెళ్తోంది...

అంతలో చెరువు దగ్గరికి ఓ వేటగాడు వచ్చాడు.



బాతు పైకి వల విసిరాడు. వలలో చిక్కుకున్న బాతు గట్టిగా అరిచింది. కొంగ ఏమి చేస్తుంది పాపం?! ఏమీ చేయలేక బాధ పడింది.

అయితే, బాతు అరుపులు విన్న సింహం గిరుక్కున వెనక్కి తిరిగి, కొలను వైపుకు దూకింది.

సింహాన్ని చూడగానే వేటగాడు భయంతో వణికిపోయాడు. వలని, బాతుని వదిలి పరుగు తీసాడు.

బాతు సంతోషించింది. ప్రమాదం నుంచి కాపాడిన సింహానికి బాతు, కొంగ కృతజ్ఞతలు తెలుపుకున్నాయి.



"మంచి మనసు ఉంటే చాలు" అని తెలుసుకుని, అవి రెండూ సింహానికి స్నేహితులైపోయాయి. అటుపైన స్నేహితులు మూడూ సంతోషంగా కాలం గడిపాయి!

కొడుకు: బడికి ఎందుకమ్మా! వెళ్ళేది?!

అమ్మ: నేర్చుకునేందుకు బాబూ! మనం ప్రశ్నలడిగితే అయ్యవార్లు సమాధానం చెబుతారు.

కొడుకు: మరి మా మాస్టారు ఎప్పుడు చూసినా మమ్మల్నే ప్రశ్నలడిగి తెలుసుకొంటున్నారేం?!






# పట్టుదల

*'మా మాండలికంలో రాస్తాం' అని పట్టుదలగా, ఇదిగో- ఈ పిల్ల రచయిత ఇట్లా మొదలెట్టాడు! వీని బతుకు ఏమైతాందంటే దానికేం కర్మ- లచ్చనంగా ఐతంది!*

*రచన: టి. ఇశాక్, 10 వ తరగతి, జిల్లా పరిషత్ హైస్కూల్, రాయలచెరువు, అనంతపురం జిల్లా.*

రాయలచెరువు ఊళ్లో సీనుగాడు ఏడో క్లాసు చదువుతున్నాడు. ఈడు ఎట్టుంటాడంటే ఎర్రగా, ఎముకలు బైటక్కనపడి, బక్కోని లెక్కుంటాడు. నెత్తెంటికలు చెదిరింటాయి. రెన్నెల్లకో మూన్నెల్లకోసారి గానీ స్నానం జేపిచ్చుకోడు. గాని ముఖం చూస్తే అందగాని లెక్కనే వుంటడు. సూపులు జూత్తే ములుకుల్లెక్కుంటయి.

ఈడికి సదువుకోల్లని ఆసె. ఏస్కునే బట్టలు లేవు గానీ ఈన్కి సదువు అంటే ప్రానం. బళ్ళో ఇచ్చిండే గుడ్డలేస్కొని తిరిగేటోడు. బడికి పోయినప్పట్నుంచి సదువు మీదనే ద్యాస. అట్టాంటే ఎప్పుడూ అట్టాగని గాదు- అయ్యవారు పాటాలు సెప్పేటప్పుడొక్కటే- మళ్ళా బైట ఆడ్కొనేటప్పుడు ఆడుక్కుంటాడు; అల్లరి జేత్తాడు.

సీనుగాని అల్లరి సూసి సారు తిట్టేటోడు. మళ్ళా వాని సదువు సూసి

ఊర్కుండేటోడు. సారు పాటాలు సెప్తాన్నాడంటే పక్కన పామొచ్చి పండుకున్నా తల్కాయ తిప్పేటోడు కాదు- అట్లాంటోడు వీడు. సాన మంది అనేటోళ్ళు- "నీకి తినేకే లేదు; యాదన్న పని జేస్కొని బతక్కోండా నీకీ సదువు సంద్యా ఏంట్కిరా?" అని. ఐనా వాడు సదువు మీద పట్టు ఇడిసిపెట్లేదు. సీనుగాన్ సదువు ఐపోతుందనేకి, సీనుగానమ్మోళ్ళు ఊరు మార్నారు, పనుల్లేవని. అట్లా ఊళ్ళు తిరుగుతాంటే ఒకూర్లో రోడ్డేసే పని దొరికింది. యాదో పని- తినేకి తిండి గాల్లంటే జోబీలోకి డబ్బులు గాల్ల. కాబట్టి ఆ పనికి ఒప్పుకున్నారు.

ఓరోజు సీనుగానమ్మోల్లని ఆఫీసరు పట్నానికి రమ్మన్యాడు. ఈళ్ళంతా పోయినారు నడుసుకుంటా. పట్నం పోయే దావలో ఓ బడి గనపడింటే సీనుగాడు అందర్నీ బండెక్కించి, తను మాత్రం నడుస్తా "మీరు పాండి. నేను మల్లా వత్తాను" అన్న్యాడు. 'సరేలే' అని వీళ్ళూ పోయినారు. సీనుగాడు అక్కడ్నే బడి సందిన నిలవడి ఐవారు పాటాలి సెప్తాంటే బయట్నించే సూస్తన్నాడు. పాటం అవంగనే 'వాల్లందర్లెక్క నేనెప్పుడు కుసుంటానే'నని ఏడ్సుకుంటా ఇంటికి బేనాడు. అమ్మోల్లు వచ్చాక 'సదువుకుంటా'నని ఒక్కటే పట్టు పట్టిన్యాడు. సీనుగానమ్మోళ్ళు వాడ్ని తిట్టి, "నువ్వు సదువుకునేకి పోతే ఈడ సిన్నోన్ని ఎవడాడిచ్చుకుంటాడు?" అని తిట్నారు.




కాన్లే అని ఇంటికాణ్ణే ఉన్యాడు వాడు. అయినా మనసులోనేమో సదువుకోల్లని ఉందాయె. మళ్ళా పొయ్యి అదే బడి బైట నిల్బడి సూత్తాన్యాడు. అది సూసి ఐవారు "ఎవరు నువ్వు" అన్యాడు. సీనుగాడు

అంతా సెప్పినాడు.

అప్పుడు ఐవారు 'మరి నేను సదివిత్తాను. సదువుకుంటావా?' అనంటే సదువ్కుంటానన్యాడు. సరేనని ఐవారు అదే బళ్ళో సేరిపించినాడి.



అంతలో సీనుగానమ్మోళ్ళు వచ్చి సంగతేందని అడిగితే, సీనుగాడు సదువుకుంటానన్యాడు. గానీ సీనుగాన్నాయన మాత్రం ఒప్పుకోల్యే. ఈడేడుస్తా 'ఏంటికి' అనడిగితే అప్పుడాయప్ప "సదువుకునేకి మాత్రం బడుంది; మళ్ళా అన్నమెవరు వెడ్తార్రా" అంటానే వీడు ఏడ్చినాడు.

వాళ్ళ మాటలిని ఐవారు "దానికేం బయం ల్యా. ఏంటికంటే గోర్నమెంటోల్లు బాలల వసతి గృహాలు కట్టించిన్యారు. దాంట్లో అన్నీ ఉంటాయి" అన్యాడు ఐవారు.

"మళ్ళా వానికేమన్నైతే ఎవ్వరు బాధ్యులు?" అంటానే "దానికి నేనే బాద్యున్ని" అన్యాడు ఐవారు.

ఇంగ సీనుగాడు బళ్ళోబాగా సదువుకుని పదోక్లాస్ పాస్ ఐనాడు. మళ్లీ ఇంటరూ ఇవన్నీ అనంతపురం "బాలల వసతిగృహం"లోనే వుండి సదువుకున్యాడు.




ఇంగీమద్దలో వాడు యాడుండాడో ఈ వూరికి రాల్యా.

దాదాపు పదేల్లయితాంది. సీనుగాడు పట్టుదలమీద సదువుతానే ఉన్యాడు. ★



# సింహం-అడవి

*మనుషులు అడవిని నాశనం చేయకుండా కాపాడుకునే మంచి సింహానికే జ్వరం వస్తే, మరి నిజంగా కష్టమే!*

*రచన: 2 వ తరగతి సి గ్రూపు పిల్లలు, రాధ స్కూల్ ఆఫ్ లెర్నింగ్, అనంతపురం.*



ఊరికి దగ్గరగా దట్టమైన అడవి ఒకటి ఉండేది. గుబురైన చెట్లతో, గల గలా పారే నీళ్ళతో, అనేక జంతువులతో ఆ అడవి కళకళలాడేది.

దీనికి కారణం, ఆ అడవిలో ఉండే సింహం. చెట్లను కొట్టేసేందుకూ, జంతువుల్ని వేటాడేందుకూ వచ్చే వాళ్ళని అది అస్సలు సహించేది కాదు. మనుషులందరికీ అదంటే భయం. అది ఉన్న అడవిలోకి వాళ్ళెవ్వరూ అడుగు పెట్టే వాళ్ళు కాదు.

ఒకసారి ఎందుకనో సింహం ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది.



దాంతో అది గుహకే పరిమితమైపోయింది. ఇదివరకటి లాగా అడవి అంతటా తిరగట్లేదు.

ఆ సంగతి తెలుసుకున్న ఊళ్ళో మనుషులు మళ్ళీ అడవిలో తిరగసాగారు. చెట్లు కొట్టేయటం, కుందేళ్ళనూ జింకలనూ వేటాడటం మొదలు పెట్టారు. రోజు రోజుకూ అడవి పలచబారింది.

'దీనికంతటికీ కారణం సింహరాజు ఆరోగ్యం బాగా లేకపోవటమే' అని గుర్తించిన జంతువులన్నీ సింహం గుహకు వెళ్ళి చూసాయి. సింహం జ్వరంతో మూలుగుతూ పడుకొని ఉన్నది. డాక్టరు దగ్గరికి వెళ్లనే లేదు!





దాంతో జంతువులన్నీ కలిసి ఏనుగు డాక్టరుకు ధైర్యం చెప్పి, దాన్ని తీసుకెళ్ళి సింహానికి వైద్యం చేయించినై.

సింహానికి ఆరోగ్యం బాగైంది. అడవి అంతటా దాని గర్జనలు వినిపించినై మళ్ళీ. దాంతో మనుషులంతా అడవికి రావటం మానేసారు. త్వరలోనే అడవి అంతా చెట్లు-జంతువులతో కళకళ లాడింది.

**గమనిక!**

పెద్ద నోట్ల రద్దు తర్వాత ఆర్థిక వ్యవస్థలో వస్తున్న మార్పుల నేపథ్యంలో, కొత్తపల్లికి వచ్చే ఆర్డర్లు, విరాళాలు కూడా గణనీయంగా తగ్గాయి. అందువల్ల, ఇష్టం లేకున్నా 2018 జనవరి సంచిక నుండి కొత్తపల్లి ధర పెంచవలసి వస్తున్నది.

పాఠకులు, శ్రేయోభిలాషులు అర్థం చేసుకొని కొత్తపల్లిని మునుపటి లాగా ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

ఇప్పటికే చందాదారులైన వారి చందాలను, మారిన యీ ధరలకు అనుగుణంగా సవరించనున్నాము.

జనవరి 2018 నుండి అమల్లోకి రానున్న కొత్త ధరలు:

విడి పత్రి వెల :రూ. 30/

12 సంచికలకై ముందస్తు చందా: రూ. 360/

# బొమ్మకు కథ రాయండి

*ఈ పిచ్చుక పిల్లల్ని చూసారుగా, ఏవో ముచ్చటించుకుంటున్నాయి సీరియస్‌గా. వాటి ముచ్చట్లకు సరిపోయే కథను ఒకదాన్ని రాయగలరేమో చూడండి. మీ కథ బాగుంటే దాన్ని కొత్తపల్లి 96 వ సంచికలో ప్రచురిస్తాం. ప్రయత్నం మొదలెట్టండి మరి !*



**మా చిరునామా:**

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి , అనంతపురము జిల్లా, ఆంధ్రప్రదేశ్-515101.







# విద్య-విలువ

*రచన: శ్రీ చొప్ప వీరభద్రప్ప, అనంతపురం.*

ప్రవీణ్ వాళ్ళ అమ్మ-నాన్నలు ఎప్పుడూ అనుకునేవాళ్ళు- "మాకు చదువు రాక చాలా కష్టపడుతున్నాము; ఏమైనా గానీ మా కుమారుడిని మటుకు బాగా చదివించాలి" అని.

వాళ్ళు అనుకున్నట్లే ప్రవీణ్ కూడా చాలా శ్రద్ధగా, పట్టుదలతో చదువుకొని, పోస్టుగ్రాజు-యేషన్ పూర్తి చేసినాడు. "పై చదువులు ఇక వద్దు, ఏదైనా ఉద్యోగం చేసి అమ్మానాన్నల్ని సుఖపెడతాను' అని ఉద్యోగ ప్రయత్నం మొదలుపెట్టాడు.

ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రభుత్వ ఉద్యోగాలేవీ రాలేదు. తల్లిదండ్రులు ముసలివాళ్ళవుతున్నారు; సరైన ఆహారం కూడా తింటున్నట్లు లేరు; వాళ్ల ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే ఉంది. "ఇన్నాళ్ళూ అమ్మనాన్నలు నా కోసం ఎంతో శ్రమ కోర్చి నన్ను పోషించారు కదా! ఇప్పుడు వాళ్లను నేను పోషించలేకపోతున్నానే" అని అతనికి బాధ మొదలైంది.

రాను రాను కుటుంబ పోషణ భారం కూడా అతని భుజాలమీద పడింది. తను ఏదో ఒక పని చేస్తే తప్ప ఇంట్లో ఎవరికీ భోజనం ఉండని స్థితి వచ్చింది.

ఇక తను పెద్ద చదువు చదివినాడనే భావనను ప్రక్కకు పెట్టేసి, ఏదైనా షాపులలో పని దొరుకుతుందేమోనని ప్రయత్నించాడతను. అతని సర్టిఫికెట్లు చూసి "ఇంత పెద్ద చదువులు చదువుకున్నావు; నీయట్ల వానికి మేమేం ఉద్యోగం ఇస్తామయ్యా?!" అంటూ ఎవ్వరూ ఏ పనీ ఇవ్వలేదు అతనికి.

"ముగ్గురికి కూడా అన్నం పెట్టలేని నా ఈ చదువు మొత్తం వ్యర్థం" అనుకున్న ప్రవీణ్ చివరికి తన సర్టిఫికేట్లు అన్నీ పక్కన పెట్టేసాడు. కార్లు, జీపులు రిపేరు చేసే మెకానిక్ షెడ్డులో పనికి కుదురుకున్నాడు. తనెవరో, తన చదువేమిటో ఎవరికీ తెలీకుండా మసలుకున్నాడు.

చూస్తూండగానే ఆరు నెలలు గడిచి-పోయినాయి. ఎంత కాదనుకున్నా, చదువువల్ల తెలివి తేటలకు ఒక అర్థం ఏర్పడుతుంది కదా! బాగా చదువుకున్న ప్రవీణ్ వాహనాలను సరిచేసే పనిలో కూడా చక్కని నైపుణ్యం సంపాదించాడు.

ఒకనాటి ఉదయం ఒక ఆఫీసరు గారు తన కారు తెచ్చి ఇచ్చారు. దానితో సమస్యలు ఏమి వస్తున్నాయో చెప్పి, "సమస్యలన్నీ పెద్దవే; అయినా దీన్ని తొందరగా సరి చేయాలి; సమస్యలు తీరతాయా? సాయంత్రంకల్లా కారును సిద్ధం చేసి ఇస్తావా?" అన్నాడు.

"తప్పకుండా!" అన్నాడు ప్రవీణ్.

అన్నట్లుగానే ఆరోజు సాయంత్రం లోగా దానిలోని లోపాలన్నీ సరిచేసి, బండిని శుభ్రంగా కడిగి, సిద్ధం చేసి ఆ ఆఫీసరు గారి ముందుంచాడు.

కొత్తది లాగా మెరిసిపోతున్న కారును నడిపి చూసుకున్న ఆఫీసరు గారు సంతోషపడి, అదనంగా కొంత డబ్బు తీసి ప్రవీణ్‌కు ఇవ్వబోయారు. ప్రవీణ్ మర్యాదగానే ఆ డబ్బును తిరస్కరిస్తూ, "మా యజమాని

ప్రతి నెలా నాకు జీతం ఇస్తాడు. మీరిచ్చే ఆ అదనపు డబ్బును కూడా ఆయనకే ఇవ్వండి సర్" అని చెప్పాడు.




ఆఫీసరుగారికి ప్రవీణ్ నిబద్ధత నచ్చింది. షెడ్డు ఓనర్‌తో "ఇట్లాంటి మంచి బుద్ధి గల పిల్లలు చాలా అరుదు. మా ఆఫీసులో నాలుగో తరగతి కాంట్రాక్టు పని ఒకటి ఖాళీ ఉన్నది. ఇతన్ని ఆ పనిలో పెట్టుకుందామని ఉంది. నువ్వు ఇతన్ని పంపిస్తావా?" అని అడిగాడు.

షెడ్డు ఓనర్ ప్రవీణ్ మంచితనాన్ని, పని తీరును గొప్పగా చెప్పి, "తమరు గవర్నమెంటు ఆఫీసులో పని ఇస్తానంటే ఇంకేమి, సంతోషం. అతని జీవితం బాగుపడుతుంది. పిలుచుకొని పొండి" అని సంతోషంగా సాగనంపాడు.

అలా ప్రవీణ్ ప్రభుత్వ ఆఫీసులో కాంట్రాక్టు అటెండర్‌గా చేరాడు. అక్కడ కూడా తన చదువుగురించి ఎవ్వరికీ తెలియనివ్వలేదు. పగలంతా తనకు ఇచ్చిన పనల్లా చేసేవాడు; ఆఫీసర్లందరికీ ఎవరికి కావలసిన ఫైళ్ళు వాళ్లకు అందించేవాడు. అదంతా అయిపోయాక, రాత్రిపూట ఇంట్లో ప్రశాంతంగా కూర్చొని, ప్రభుత్వ ఉద్యోగాల అర్హతా పరీక్షలకు పనికొచ్చే మంచి మంచి పుస్తకాలు చదివేవాడు. రకరకాల అర్హతా పరీక్షలు రాస్తూండేవాడు.

ఆ ఆఫీసులో కరుణాకర్ అనే సెక్షన్ ఆఫీసర్ ఒకాయన ఉండేవాడు. ఆ సెక్షన్‌లో పనిచేసే ఇరవై మందీ పర్మనెంట్ ఉద్యోగస్తులే. అయినా సెక్షన్ ఆఫీసర్‌గా ఈయన తన క్రింది ఉద్యోగులందరినీ చిన్నచూపు చూసేవాడు. అడ్డు-ఆపు లేకుండా మాట్లాడేవాడు. ఇక ఆయనకు ప్రవీణ్ ఒకలెక్కా?!

ప్రవీణ్ ఆయనకు దగ్గరగా నిలబడితే "స్నానం చేసినావా లేదా? చెమట వాసన

వస్తున్నావే?!" అంటాడు. ప్రవీణ్ వేసుకునే బట్టలు చూసి "ఎన్నాళ్ళకు ఒకసారోయ్, నువ్వు బట్టలు మార్చుకునేది?" అని తన జోకుకు తానే నవ్వుతాడు. మంచి నీళ్ళివ్వ మంటాడు; ప్రవీణ్ గ్లాసుతో నీళ్ళు తెచ్చి యిస్తే "గ్లాసు బాగా కడిగినావాలేదా? నీళ్ళు తెచ్చే ముందు చేతులు బాగా కడుకున్నావా?" అని అవమానిస్తాడు.




టేబుల్‌ను చూపించి "దానిమీద ఎంత దుమ్ము పేరుకున్నదో చూడు?! తుడవాల్సిన పని లేదా?" అని చివాట్లు పెడుతూనే వుంటాడు. ప్రవీణ్ అతని మాటలకు బాధపడేవాడు; కానీ "ఈ పనీ లేకపోతే ఇక ఇల్లు గడిచేదెలాగ?" అన్న ఆలోచన అతనిలోని సహనశీలతను మరింత పెంచింది.

ఒకసారి ఆఫీసులో కొత్తగా చేరిన యువ ఉద్యోగి ఒకడు ఉండబట్టలేక కరుణాకర్‌ను "ఏంసార్? ప్రవీణ్ అంత ఉత్తముడు కదా, అతన్ని అట్లా వేధిస్తున్నారు?" అని అడిగేసాడు. ఈ మాట వినగానే కరుణాకర్ అగ్గిమీద గుగ్గిలం అయిపోయి, ప్రధాన ఆఫీసరుగారికి ప్రవీణ్ మీద ఫిర్యాదు చేసాడు: 'తన సెక్షన్ లోని ఉద్యోగులందరినీ ప్రవీణ్ తనపైన తిరుగుబాటు చేసేటదుకు పురిగొల్పుతున్నాడు" అని.

ప్రధాన ఆఫీసరు సెక్షన్లోని ఉద్యోగులను పిలిచి అడిగితే ఎవ్వరూ ప్రవీణ్‌కు వ్యతిరేకంగా మాట్లాడలేదు. అందరూ 'కరుణాకర్ ఆగడాలు ఎక్కువైనాయి' అనే చెప్పారు.

ప్రవీణ్ అంటే అభిమానం గల ఆఫీసరు గారు అందరికీ సర్ది చెప్పి పంపించాల్సి వచ్చింది.

రోజులు ఎప్పుడూ ఒకేలాగా ఉండవు. ఒకనాడు ప్రవీణ్‌కు ప్రభుత్వం వారినుండి ఒక ఉత్తరం వచ్చింది. అతను వెంటనే ఆ

కవరును తెచ్చి ప్రధాన ఆఫీసరు గారికి ఇచ్చి నమస్కరించాడు.

ఆఫీసరు గారు ఆ ఉత్తరం చదివి, లేచి నిలబడి, ప్రవీణ్‌కు మర్యాదగా కుర్చీ చూపి కూర్చోమని, 'ఈ కవర్‌లోని విషయం నాకు నిన్ననే తెలిసింది ప్రవీణ్- చాలా సంతోషమైంది' అన్నారు. వెంటనే ఒక అటెండరును పిలిచి "మన ఆఫీసర్లందరినీ అర్జంటుగా ఇక్కడికి రమ్మను" అంటూ ఒక సర్క్యులర్ పంపారు.



ఆఫీసర్లందరూ సమావేశమయ్యే సమయానికి ప్రధాన ఆఫీసరుగారి టేబుల్ ప్రక్కగా కుర్చీలో కూర్చుని ఉన్నాడు ప్రవీణ్. అది చూడగానే కరుణాకర్‌కు ఎక్కడలేని కోపం వచ్చింది. ప్రవీణ్ దగ్గరకు వచ్చి నిలబడి "ఎంత పొగరురా, నీకు? నువ్వు నీ బోడి ఉద్యోగానికి రాజీనామా చేసి పోతే పో, కానీ మేం ఇంతమందిమి ఆఫీసర్లం వస్తే పైకి కూడా లేవకుండా కుర్చుంటావా?! పైకి లే, ముందు!" అని అరిచాడు. ప్రవీణ్ చటుక్కున లేచి నిలబడి, అతనికి నమస్కరించాడు.

అంతలోనే అక్కడికి వచ్చిన ప్రధాన ఆఫీసరు గారు ప్రవీణ్‌ను కూర్చోమని చెప్పి, కరుణాకర్‌తో "ఏమిటి సర్, మీ నోటి దురుసుతనం మరీ ఎక్కువైందేమి? ఈయన ఎవరనుకున్నారు? గ్రూప్-1 స్టేట్ ఆఫీసర్‌గా శిక్షణ నిమిత్తం మన ఆఫీసుకు వచ్చారు ఈయన. మీరే కాదు, నాలాంటి జిల్లా ఆఫీసర్లందరూ కూడా ఆయన ముందు కూర్చునే యోగ్యత లేనివాళ్లమే, అర్థమైందా?" అన్నారు.

కరుణాకర్ ముఖం తెల్లబడింది. అతను తలవంచుకొని ప్రవీణ్ వద్దకు వెళ్ళి 'సారీ ప్రవీణ్' అన్నాడు.

ప్రక్కనే ఉన్న ఉద్యోగి ఒకడు "ఏమిటి నీ సంబోధన- 'ప్రవీణ్ సార్' అనాలి" అన్నాడు. అక్కడున్న వాళ్ళంతా గొల్లున నవ్వారు.




"కొండ అద్దంలో చిన్నదిగా కనబడినంత మాత్రాన అది నిజంగా చిన్నదై పోదు. వ్యక్తి యొక్క యోగ్యతాయోగ్యతల్ని ఆ వ్యక్తి వేసుకున్న దుస్తులను బట్టి నిర్ణయించకూడదు.

మట్టిపొర క్రమ్మినంత మాత్రాన, అందరూ రాయి అన్నంత మాత్రాన, మాణిక్యం మాణిక్యం కాకుండా పోదు. ఇన్నాళ్ళూ మనతో కలిసి ఉన్నా, ఈ ప్రవీణ్‌గారి గొప్పతనాన్ని మనం ఎవ్వరం గుర్తించలేకపోయాం చూడండి, అది మనందరికీ చెంప పెట్టు అవ్వాలి" అన్నారు ప్రధాన ఆఫీసరుగారు.

"అట్లా అనకండి-వేరే అవకాశాలేమీ లేక, పొట్ట గడవక, గ్యారేజీలో పనిచేస్తున్న నాకు ఇక్కడికి వచ్చే అవకాశాన్నిచ్చారు మీరు. ఆనాడు మీరు కాపాడకుండా ఉంటే ఈ మొక్క ఇంత పెద్దగా అయ్యేది కాదు. నేను మీకు ఎల్లప్పటికీ కృతజ్ఞుడిగా ఉంటాను" అన్నాడు ప్రవీణ్, సహజ సిద్ధమైన తన సహృదయంతో.



**అసలు బాధ:**



ఉపాధ్యాయులు: పరీక్షలొచ్చేస్తున్నాయ్! సిలబస్ అంతా ఐపోయింది! ఇక పనంతా మీదే! ఇప్పుడు మీకేమన్నా ప్రశ్నలుంటే అడగండి, నేను పరిష్కారాలు చెబుతాను.

కొంటె పిల్లాడు: ఎందుకు సర్, మీరు ఇంత బాధ పడతారు? ఇంత శ్రమ పడే బదులు, కేవలం ఆ ప్రశ్న పేపరు ఎక్కడ ప్రింటవుతోందో చెప్తే సరిపోయేదిగా?!




# లంకె బిందెలు

రచన : ఉండ్రాల రాజేశం, సిద్దిపేట, మెదక్.

సిరికొండను పరిపాలించే చంద్రభానుడు మంచి రాజు. ప్రజల కష్టసుఖాలను గుర్తిస్తూ సమస్యల్ని తక్షణం పరిష్కరించేవాడు.

అయితే కొన్ని యేళ్ళుగా రాజ్యంలో కరువు తాండవిస్తోంది. ఏ వారానికి ఆ వారం, ప్రజలకు సరిపడా ఆహార పదార్థాలను గ్రామాలకు సరఫరా చేయటమౌతున్నది. ఖజానాలోని ధనమంతా ఖర్చయిపోయింది- కష్టాలలో ఉన్న ప్రజలకు మరి కొద్ది నెలలపాటు ఆహార సౌకర్యాలు కల్పించేందుకు సరిపోయేంత ధనం మాత్రం ఉన్నది. తర్వాత కష్టమే..

'ఈ సమస్యను ఎలా అధిగమించాలి?' అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడాయన.

గ్రామాలకు పంపే ఆహార ధాన్యాల సరఫరా తక్షణం నిలిపి వేసాడు. వారం తిరిగే సరికి అన్ని గ్రామాలలోనూ కష్టాలు ఎక్కువయ్యాయి. ప్రజా ప్రతినిధులంతా మహారాజుతో మొర పెట్టుకున్నారు: గ్రామాల్లో పరిస్థితిని మనవి చేసుకున్నారు.

చంద్రభానుడు అందరినీ కూర్చోమన్నాడు.



"మన రాజ్య ఖజానా అంతా ఖాళీ అయ్యింది. ప్రస్తుతానికి పొరుగు రాజ్యం నుండి ఆహార పదార్థాలు తెప్పించాను. తీసుకెళ్ళండి" అంటూ వాటిని అందరికీ పంచాడు. "ఇప్పటి వరకూ ఎలాగో ఒకలాగా నెగ్గుకొచ్చాను. ఇకపైన నేను అశక్తుడిని. రాజ్యమంతటికీ సరిపడే ఆహార పదార్థాలను ఇక్కడినుండి పంపలేను క్షమించండి" అని చెప్పుకొచ్చాడు.

దాంతో ప్రజా ప్రతినిధులంతా నివ్వెరపోయారు. 'ఇప్పుడెలాగ?' అని గుటకలు మ్రింగారు.

రాజుగారు కొనసాగించారు: "మా వంశాచారం ప్రకారం ప్రతి రాజూ తమ వారసుడికి చెబుతూవచ్చిన రహస్యం ఒకటి ఉన్నది. పట్టాభిషేక సమయంలో మా నాన్నగారు కూడా నాకు చెప్పారు: 'మన గ్రామాలలోని చెరువులు అన్నింటిలోనూ లంకెబిందెలు దాగి ఉన్నాయి' అని.

ఈ భూమిలోపల ఉన్న సమస్త సంపదలపైనా హక్కు ప్రభువులదే; కానీ ఈ కష్ట సమయంలో నేను ఆ సంపదని మొత్తాన్నీ జాతికి అంకితం చేయదలచాను. మీ మీ ఊరి చెరువుల్లో ఆ లంకె బిందెలున్న స్థానాలను మీరే గుర్తించగలరేమో చూడండి. ఆ సొమ్ముని మీరే వాడుకోండి. మీకు దొరికిన లంకె బిందెలలోని సొమ్మంతా మీ గ్రామానిదే!" చెప్పారు.

ప్రజలంతా ఆతృతగా చెరువుల దగ్గర చేరారు. మరుసటి రోజు ఉదయం నుండే చెరువుల్లో త్రవ్వకాలు మొదలయ్యాయి. త్రవ్విన మట్టినంతా కట్టకు పోసారు ప్రజలు. వారం రోజులు గడిచే సరికి అన్ని చెరువుల్లోనూ

పెద్ద పెద్ద గుంతలు ఏర్పడ్డాయి.



చెరువులు బాగా లోతు అయితే అయ్యాయి; కట్టలుకూడా బాగా బలిష్ఠంగా అయినాయి. కానీ లంకె బిందెలు మాత్రం ఇంకా ఎవ్వరికీ దొరకలేదు. అయితే ఎందుకనో మరి, అకస్మాత్తుగా వానలు మొదలయ్యాయి. భారీ వర్షాలకు చెరువులన్నీ నిండి, మరవలు పారాయి.

ఇప్పుడింక లంకె బిందెలకోసం చెరువులు తవ్వడం వీలు కాలేదు. మహారాజు చంద్రభానుడు ప్రతి గ్రామానికీ ఒక బిందెడు బంగారు నాణాలు పంపాడు. "చెరువులు మనకు ఏనాటికైనా ఉపయోగపడే లంకెబిందెలు. వాటిని జాగ్రత్తగా చూసుకుందాం. పూడిక తీసిన చెరువులు ఎక్కువ నీళ్లని ఆపుతాయి; మన అవస-రాలకోసం మరింత నీటిని అందుబాటులోకి తెస్తాయి. బావుల్లో నీళ్ళు మరిన్ని ఊరతాయి. ఇదిగో, ఇప్పుడిక ఈ డబ్బుని పెట్టుబడిగా పెట్టండి. ఎవరికి వారు వ్యవసాయం చేసి, బంగారు పంటల్ని పండించండి. ఇకపై మన బంగారాన్ని మనమే పండించుకుందాం!" అంటూ.

ఆ ఏడాది సిరికొండలో బంగారు పంటలు పండాయి. రాజుగారి ఖజానా మళ్ళీ పొంగి పొరలింది.

"చెరువుల్లో నిజానికి లంకె బిందెలంటూ వేరే ఏమీ లేవురా; కానీ చెరువులు పూడిక తీసి, గట్లు బాగు చేసుకొని ఉంచితే, అట్లా నిండిన చెరువులు బంగారు పంటలు పండిస్తాయి. అదీ రహస్యం" అని చెప్పుకున్నారు ప్రజలు. "మన రాజుగారి తెలివి మహా గొప్పది" అని అందరూ ఆయన్ని పొగడ్తలతో ముంచెత్తారు!




# ఒక్క సుగుణం

తెలుగు జానపద కథ

*కథనం, సౌజన్యం: శ్రీమతి ఓలేటి శశికళ*

రంగడు ఓ గజదొంగ. దొంగతనాలే వృత్తి, ప్రవృత్తులు వాడికి. రక్షకభటులకు దొరకకుండా తిప్పలు పెడుతూ, ప్రజలకు నిద్ర లేకుండా చేస్తున్నాడు.

ఒక రకంగా చూస్తే అవసరమే ఆ యువకుడిని దొంగగా మార్చింది అనచ్చు. అతను చక్కగా చదువుకుంటున్న రోజుల్లో తండ్రి పోయాడు; కుటుంబ భారం మొత్తం అతని తలపై పడింది; సంపాదనా మార్గాలు గగనమయినాయి. సరిగ్గా ఆ సమయంలోనే అతనికి ఒక గజదొంగతో స్నేహం కుదిరింది. దొంగదారి పట్టాడు; పుష్కలంగా ధనం సంపాదించాడు. వాడి సంపాదనని చూసిన తల్లికి అర్థమైంది- కొడుకు దారితప్పాడని. అయినా ఆమె ఉదాసీనంగా ఉండిపోయింది తప్ప, కొడుకుని సంస్కరించడానికి ప్రయత్నించలేదు.

అవి పండుగ రోజులు. ఊరు అంతా

సంబరాల్లో మునిగి ఉంది. ఇళ్ళు దోచుకోవడానికి చాలా అనువైన సమయం. రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతాన ఒక సంపన్నుడి ఇల్లు దోచుకొని, ఇంటి కప్పులమీదనుంచి పారిపోతూ ఉన్నాడు రంగడు. అనుకోకుండా వాడి కాలు జారింది! దొర్లుకుంటూ పోయి ఒక దేవాలయ ప్రాంగణంలో పడ్డాడు. ఆ పడటంలో వాడి కాలు బెణికింది; మోకాళ్ళు దోక్కుపోయాయి. అయినా వాడు పడిన చోటు చీకటిగా ఉండటం వల్లనో ఏమో, ఎవరూ వాడిని గమనించలేదు.

ఆ సమయంలో మహాత్ముడొకాయన గుడిలో భాగవతం చెబుతున్నాడు. "భగవంతుడిని శరణుజొొచ్చిన వాడికి ఇక దు:ఖం ఉండదు. సంపూర్ణ శరణాగతి మనిషిని అన్ని బంధాలనుండి విడుదల చేస్తుంది.." అంటూ.

రంగడికి దొంగతనాలు నేర్పిన గురువు వాడికి ఏనాడో చెప్పి ఉన్నాడు: "ఎట్టి పరిస్థితుల్లోనూ నీతి బోధలు జరిగే ప్రదేశాలకు వెళ్ళొద్దు" అని. అయినా అసంకల్పితంగా కొన్ని నీతి వాక్యాలు, ఇలా వాడి చెవిన పడ్డాయి. అట్లాంటి మంచి సంగతులు జీవితంలో ఏనాడూ విని ఉండని రంగడికి అవన్నీ అద్భుతంగా అనిపించాయి!

కొంత సేపటికి ప్రవచనం పూర్తయింది. జనాలు ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఎవ్వరూ లేని జాడ చూసి, రంగడు మెల్లగా కుంటుకుంటూ ఆ మహాత్ముడి దగ్గరికి పోయాడు. వాడిని చూసి ఆదరంగా నవ్వాడాయన. రంగడు ఆయనతో " అయ్యా! అనుకోకుండా నేను ఇవాళ్ల మీ ప్రవచనం విన్నాను. భగవంతుడికి పాపాత్ములు, పుణ్యాత్ములు అనే తేడా లేదన్నారు. ఎవరు శరణాగతి చెందితే వారిని ఆయన అనుగ్రహిస్తాడన్నారు. నిజమేనా?" అని అడిగాడు.

ఆయన తల ఊపుతూ "పూర్తిగా నిజం నాయనా! కానీ ఆయన అనుగ్రహం కావాలంటే మనలోని దుర్గుణాలను వదిలిపెట్టాలి" అన్నాడు.

రంగడు గట్టిగా నవ్వి, ఆయనతో "స్వామీ! నా పేరు రంగడు. నేనొక పెద్ద దొంగను. రాత్రిళ్ళు ప్రజల్ని దోచుకుంటాను; పగటి పూట జూదగృహానికి వెళ్ళి జూదం ఆడుతాను; ఇష్టం వచ్చినప్పుడల్లా సారాయి తాగుతూ విలాస జీవితం గడుపుతాను. విపరీతంగా అబద్ధాలు చెప్తాను. మీరు చెబుతున్న ప్రకారం చూస్తే మరి నాలాంటి దుష్టుడిని దేవుడు కూడా ఉద్ధరించలేడన్న మాట!" అన్నాడు.

"అంత నిరాశ అవసరంలేదు నాయనా! చింత పడనక్కర్లేదు. నీ ఈ దుర్గుణాల్లో ఏ ఒక్కదాన్నైనా దైవం కోసం ఒదులుకోగలవా, నువ్వు?" అని అడిగాడు మహాత్ముడు.

"మిగతావేవీ ఒదులుకునే అవకాశం లేదు స్వామీ, నాకు- కానీ ఒక్క అబద్ధాల్ని మటుకు మానేస్తాను. నిజం చెప్పాలంటే అబద్ధాల వల్ల నాకు వస్తున్న లాభం ఏమీ లేదు; నిజం చెప్పడం వల్ల నాకొచ్చే నష్టం కూడా ఏదీ లేదు" అన్నాడు రంగడు, కొద్దిగా ఆలోచించి.

"అది చాలు నాయనా! భగవంతుడు నిన్ను చల్లగా చూస్తాడు. ఈ రోజునుండి ఎల్లప్పుడూ సత్యమే పలుకు!" అన్నాడు మహాత్ముడు.

"భగవంతుడి మీద ప్రమాణం చేసి చెబుతున్నాను- ఈ రోజు నుండీ ఎల్లప్పుడూ సత్యమే మాట్లాడతాను" అని ఆయనకు మాటిచ్చి, వెడలిపోయాడు రంగడు.

తరువాత కొద్ది రోజులకే వాడు రాజుగారి ఖజానాకు కన్నం వేసాడు! ఖజానా నిండుగా బంగారు నాణాలు, నగలు కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి. ఎక్కడా ఎలాంటి అలికిడీ లేదు.

'ఇంత సొమ్మును తీసుకెళ్ళటం వృధా. మొత్తం ఎత్తుకెళ్తే భటులనుండి తప్పించుకోవటం కూడా కష్టమౌతుంది' అని ఆలోచించి, వాడు కొన్ని బంగారు నాణాలను, నగలను మూటగట్టి తీసుకుపోబోతూ, తలుపు ప్రక్కగా ఓ పీఠం మీద ఉంచిన బంగారు పెట్టెనొకదాన్ని చూసాడు. దాన్ని తెరిచి చూస్తే ధగధగా

మెరుస్తూ కనిపించినై, నాలుగు వజ్రాలు! వాటిలోంచి కూడా రెండింటిని తీసి జేబులో వేసుకొని, చప్పుడు చేయకుండా బయటికి నడిచాడు రంగడు.




వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు కూడా వాడికి కావలివాళ్ళెవ్వరూ ఎదురుపడలేదు గానీ, తను వేసిన కన్నం పరిసరాలలోనే అపరిచితుడొకడు కనపడ్డాడు. చూసేందుకు వాడూ ఓ చిన్నపాటి దొంగలాగా ఉన్నాడు- వాడు రంగడిని ఆపుతూ "ఎవరు నువ్వు? ఇక్కడికి ఎలా వచ్చావు? ఏంచేసావు?!" అని అడిగాడు గద్దిస్తూ.

"నువ్వెవరసలు, నన్ను ఆపేందుకు?" ఒకింత భయంగాను, ఒకింత కోపంతోటీ ప్రశ్నించాడు రంగడు.

"నీలాగే నేనూ ఒక దొంగను. కనిపించట్లేదా? మర్యాదగా నువ్వు దోచుకున్న దానిలో సగం నాకివ్వు. లేకపోతే ఇప్పుడే అరిచి రాజభటుల్ని రప్పిస్తాను!" బెదిరించాడు వాడు.

"సరేలే, ఈ సొమ్ములో నీదీ ఒక సగం! సరేనా? ఇక అరవకు. కావలివాళ్ళు వస్తుంటారు.. చప్పుడు చేయకుండా బయట పడదాం ఇద్దరం!" అన్నాడు రంగడు వాడితో చేతులు కలుపుతూ.

తోడుదొంగలు ఇద్దరూ చకచకా కన్నంలోంచి బయటపడి, రంగడి ఇల్లు చేరుకున్నారు.

ఇచ్చిన మాట ప్రకారం రంగడు తను దోచుకొచ్చిన సొమ్మును రెండు సమాన భాగాలు చేసాడు. నీకు ఏది కావాలో అది తీసుకో, రెండవది నాది. తీసుకున్నాక ఇక వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోవాలి. నీకు-నాకు ఇక ఏలాంటి సంబంధమూ ఉండదు"

చెప్పేసాడు.

వాడు ఒక భాగాన్ని ఎంచుకొని అక్కడినుండి సంతోషంగా వెళ్ళిపోబోయాడు.

రంగడు వాడిని ఆపి- "ఈ సొమ్ములు కాక నేను ఇవిగో, ఇంకో రెండు వజ్రాలు కూడా తెచ్చాను- అక్కడినుండి. ఒకటి నీకు, ఒకటి నాకు. సరిపోయింది. ఇక వెళ్ళు!" అని వజ్రాలు రెండూ వాడికి చూపి, ఒక వజ్రాన్ని వాడి చేతిలో పెట్టి పంపించాడు.

తర్వాతి రోజు ఉదయాన్నే రాజభటులు రంగన్న ఇంటిని చుట్టు ముట్టి అతన్ని బంధించారు. సొత్తుతో సహా రాజుగారి ముందు ప్రవేశ పెట్టారు.

"నువ్వేనా రంగడివి? మా కోశాగారానికి కన్నం వేసిన దొంగవు నువ్వేనా?" అడిగారు రాజుగారు.

రంగడు తల ఊపాడు. "నేనే రంగడిని. ఖజానాకు కన్నం వేసింది నేనే" అన్నాడు.

"వీడు ఎత్తుకెళ్ళినవి మొత్తం దొరికాయా?" కోశాధికారిని అడిగాడు రాజు.

"ఇంకా చాలా ఉండాలి ప్రభూ!" పట్టికనందిస్తూ చెప్పాడు కోశాధికారి.

"ఏం చేసావు మిగిలినవాటిని?" రాజు అడిగాడు రంగడిని.




రంగడు ఒక్క క్షణం ఆగాడు- "అవి మీకు దొరకవు. మొత్తానికీ శిక్ష నాకే వేయండి" అన్నాడు తాపీగా.

"ఎందుకు దొరకవు?" అడిగాడు రాజు. "నీ తోడుదొంగలతో పంచుకొని ఉంటావు. అంతేగా? వాళ్లనీ పట్టుకుంటాం! ఎవరు వాళ్ళు? ఎక్కడుంటారు?" గర్జించాడు.

"ఒక్కడే ఉన్నాడు- అయినా వాడెవడో నాకు

తెలీదు- సొత్తుని మేమిద్దరం సమానంగా పంచుకున్నాం" చెప్పాడు రంగడు.

సభలో అధికారులంతా నవ్వారు.

"నీ తోడుదొంగ ఎవరో నీకు తెలీదా? ఒరే, మర్యాదగా వివరాలు అందించు, ప్రభువులవారికి కోపం తెప్పిస్తే ఏమౌతుందో నీకు తెలీదు" హెచ్చరించాడు కోశాధికారి.

"నేను అబద్ధాలు చెప్పనని ప్రమాణం చేసాను. అబద్ధం ఆడను. నిజంగానే వాడెవరో నాకు తెలీదు" అన్నాడు రంగడు.

"దొంగట! అబద్ధాలు చెప్పడట! నీతిమంతుడు!!" వెటకరించారొకరు.

"ప్రభూ! వీడిని మాకు అప్పగించండి. నిజం కక్కిస్తాం!" ఆవేశంతో ఊగిపోయాడు కోశాధికారి.

"అవసరం లేదు. ఎవరక్కడ- మా మందిరంలో మూలగా ఒక మూట ఉంటుంది- దాన్ని తీసుకురండి!" భటుల్ని ఆదేశించారు రాజుగారు.

నిజంగానే రాజమందిరంలో ఒక మూట కనబడింది. భటులు దాన్ని తీసుకొచ్చి రాజుగారి ముందు పెట్టారు.

"ఇదేగా? నీ తోడు దొంగతో పంచుకున్నది?!" వెటకారంగా నవ్వి, "దీన్ని కూడా కలుపుకొని లెక్క సరిచూడండి!" కోశాధికారిని ఆదేశించాడు రాజు.

"ఇది మీకెక్కడ దొరికింది?" రాజుగారిని పరిశీలనగా చూసి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు రంగడు.

అంతలో కోశాధికారి లెక్క చూసి చెప్పాడు- "ఇంకో మూడు వజ్రాలుండాలి ప్రభూ!" అని.

రాజుగారు రంగడితో కఠినంగా "నువ్వు ద్రోహివి, అబద్ధాలకోరువి కూడా! మిగిలిన రెండు వజ్రాలూ ఏవి?" అన్నాడు.

"ప్రభూ! మూడు వజ్రాలు!" సరిచేసాడు కోశాధికారి.

"లేదు- నేను తీసుకెళ్ళింది రెండే వజ్రాలు! నేను అబద్ధాలు చెప్పను! రెండు వజ్రాల్ని అక్కడే పెట్టెలో వదిలేసి వెళ్ళాను!" మొండిగా అన్నాడు రంగడు.

"ఒకటే దొరికింది. ఇంకా నువ్వు ఎత్తుకెళ్ళినవి మూడు వజ్రాలు రావాలి!" అరిచాడు ఒక భటుడు.

"వీడిని మాకు అప్పగించండి ప్రభూ! అన్నింటినీ కలిపి కక్కిస్తాం!" కోపంగా అరిచాడు కోశాధికారి. సభలో వాళ్లంతా "అవును!అవును!" అని అరిచారు.

"అవసరం లేదు. ఇదిగో, మరొక వజ్రం! ఇక మీరు దొంగిలించిన రెండు వజ్రాలనూ తక్షణం మాకు సమర్పించండి!" తన జేబులోనుండి ఒక వజ్రాన్ని తీసి ఇస్తూ కోశాధికారిని ఆజ్ఞాపించారు రాజుగారు.

నోటమాటరాని కోశాధికారి బిత్తరపోయాడు. తల వంచుకొని నిలబడిపోయాడు. అకస్మాత్తుగా సభలో నిశ్శబ్దం అలుముకున్నది.

భటులు కోశాధికారిని సోదా చేస్తే మిగిలిన రెండు వజ్రాలూ బయటపడ్డాయి.

"గాదె కింద పందికొక్కు, మన ఈ కోశాధికారి! ఇలాంటి ఇంటి దొంగలను క్షమించకూడదు. ఇతనికి పదేళ్ల కారాగార శిక్ష విధిస్తున్నాం" తీర్పునిచ్చారు రాజుగారు.

నిర్ఘాంతపోయిన సభికులకు సంగతి యావత్తూ వివరించారు రాజుగారు- "ఈ రంగడు దొంగే అయినా నిజంగా సత్యవాది. కొన్నాళ్ళ క్రితం మన గుడిలో గురువుగారిచ్చిన ప్రవచనం విన్నాక, వీడి మనసు కరిగింది. 'మిగిలిన తప్పులు ఏవైనా చేస్తానుగానీ, అబద్ధం మటుకు ఆడన'ని ప్రమాణం చేసాడు ఇతను! ఆ సమయంలో నేను మారువేషంలో అక్కడే ఉన్నాను; నాటినుండీ ఇతన్ని గమనిస్తూ వచ్చాను!

నిజంగానే వీడు అబద్ధాలు ఆడటంలేదని గ్రహించాను. వాడిని పరీక్షించేందుకే, మన ఖజానాకు వాడు కన్నం వేయబూనినప్పుడు, ఆ మార్గాన్ని కూడా సుగమం చేసాను.

దొంగిలించి బయటికి రాగానే వాడికి ఆగంతకుడిగా ఎదురై, తోడుదొంగ వేషం వేసిందీ, ఇంటికి వెళ్ళి వాడితో వాటాలు పెట్టుకున్నదీ కూడా నేనే. ఆ సమయంలో కూడా వాడు మాట నిలుపుకొని, సొత్తుని

సమానంగా పంచి ఇచ్చాడు. వాడు దొంగిలించింది రెండు వజ్రాలేనని నాకు ఆ సమయంలోనే తెలుసు!




ఇక కొద్ది కాలంగా మన ఖజానా లెక్కల్లో తేడాలు వస్తున్నాయి.. కోశాధికారిలో నిజాయితీ కొరవడిందని అనుమానం ఉండింది. రంగడిని సాకుగా చేసుకొని, అమూల్యమైన వజ్రాలను రెండింటిని దోచుకోబోయి, అడ్డంగా దొరికిపోయాడు మన ఇంటిదొంగ!.. ఇప్పుడిక ఈ రంగడికి శిక్ష విధించాల్సి ఉంది" అగారు రాజుగారు.

అందరూ ఆసక్తిగా చూసారు.

"నిజాయితీగల రంగడిని మన ఖజానాకు ముఖ్య కాపలా అధికారిగా నియమిస్తున్నాం. కాలాంతరంలో మనకు కోశాధికారి కూడా అయ్యే అవకాశాన్నిస్తాం. అతనికి ఈ శిక్ష నేటినుండే అమలులోకి వస్తుంది" ప్రకటించారు రాజుగారు.

సభికులంతా హర్షధ్వానాలు చేసారు. ఈసారి ఆశ్చర్యపోవటం రంగడి వంతయింది.

"ఒక్క దుర్గుణం దూరం చేసుకుంటేనే భగవంతుడు తనకి ఇంతటి అవకాశం ఇచ్చాడే, మరి పూర్తిగా సన్మార్గం అవలంబించి, సంపూర్ణంగా శరణాగతి చెందితే మరెంత కృపావర్షం కురిపిస్తాడో కదా!" అనిపించింది వాడికి. సంతోషంతో కన్నీళ్ళ పర్యంతమై చేతులు జోడించాడతడు. ఆ క్షణాన అతనిలో మొదలైన పరివర్తన అతన్ని ఆదర్శప్రాయుడయిన పౌరునిగా మార్చింది!

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**శుక్రుడు, భస్మాసురుడు, నారదుడు,చెవిటివాడు, ఫినాయిల్, సాహసం, దయ్యాలు, మజ్జిగ, పెళ్ళి, వ్యాపారి, మానవత్వం, పరీక్ష, బొమ్మలు, గౌరవం, బంగారం, గొప్ప, వసంత, కోపం,బావిలో, మోసం,**

**పిల్లలు:-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వం | గ | మ | డు | దు | ర | నా | య్యు | గా | హ | సా | కో |
| నా | ర | పె | శు | రీ | త | సం | వ | బం | బొ | పం | న |
| భ | న | గౌ | గొ | క్రు | మో | డు | మ | లు | య్యు | ద | లు |
| సా | ప్ప | లో | ల్ | ళ్ళి | డు | రి | త్వం | బొ | ఫి | లు | వి |
| చె | వి | తి | వా | డు | వ్యా | వ | బం | కో | గ | జ్జి | మ |
| బా | య్యు | హ | ర | పా | న | గ | జ్జి | భ | కో | మా | న |
| లు | డు | రి | రం | మా | ప్ప | సా | స్మా | త | పె | వం | గా |
| ఫి | వా | పా | భ | క్రు | స్మా | సు | న | క్ష | రీ | ప | త |
| నా | ళ్ళి | వ్యా | త | న | రు | డు | సం | జ్జి | మ | ప్ప | గొ |
| యి | ర | ఫి | త్వం | డు | లు | రం | హ | ళ్ళి | పె | వం | రం |
| ల్ | పె | బా | క్ష | వ | మ్మ | త | సా | గా | శు | పా | గా |
| గా | త | వి | ల్ | ళ్ళి | బొ | కో | త | న | క్ష | పం | బం |

# పదరంగం-94

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | ★ |
| 5 | | | ★ | 6 | 7 |
| 8 | | ★ | 9 | | |
| | ★ | 10 | | ★ | ★ |
| 11 | 12 | | | 13 | 14 |
| ★ | 15 | | ★ | 16 | |

**అడ్డం**

1. వయొలెట్ కలర్ తెలుగులో. (5)
5. 'దేవుడు'కి స్త్రీ లింగం. (3)
6. మొదలు లేని కమ్మగా. (2)
8. మారనే మారము. (2)
9. చేతికి వేసుకునే రింగు. (3)
10. జాలరులు వేసేది. (2)
11. తిరునాళ్లలో ఎక్కండి! గుండ్రంగా తిరగండి! (6)
15. రాయలసీమ చెమట, తిరగబడి చిన్నగా అయ్యింది. (2)
16. పల్లెల్లో దొరికే మత్తు పానీయం. (2)

**నిలువు**

1. మన జాతీయ గేయం. (5)
2. పొగరు మోతు తనమే, మరోలా. (3)
3. మొదటి సగం లేని జాతీయత. (2)
4. విదేశీయుల హాలోవీన్ పండుగలో వాడే కాయ. (3)
7. దెబ్బే; మరోలాగా. (2)
9. అనేక మందిని పొట్టన పెట్టుకున్న నీళ్ల విరేచనాల వ్యాధి. (3)
10. ఉన్న ఊరొదిలి వేరే ఊరికి వెళ్లిపోవటం, అనంతపురం జిల్లాలో ఒక ఊరు. (3)
12. చిహ్నం, ఇంకో రకంగా. (2)
13. తిరగబడిన కట్నము లో అంతం లేదు. (2)
14. దీన్ని దీనితోటే తీయాలి. (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.

సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 96 ని బహుమతిగా పంపిస్తాం!

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికై డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్!

రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్!

ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!




**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 11 | 11 | 220 |
| 2 | 2012 Set | 12 | 12 | 240 |
| 3 | 2013 Set | 7 | 3 | 175 |
| 4 | 2014 Set | 10 | 403 | 250 |
| 5 | 2015 Set | 7 | 914 | 175 |
| 6 | 2016 Set | 8 | 1178 | 200 |
| 7 | 2017 Set | 6 (ప్రస్తుతం) | 1550 | 150 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/11/2017 Postal Regn No: HDP/008/2015-2017

మంచిపుస్తకం:

## రష్యన్ జానపద కథలు

84 పేజీలు, 100 రూ. ప్రతులకు సంప్రదించండి: అనిల్ బత్తుల Ph: 9676365115

ఇరవై ఎవర్‌గ్రీన్ రష్యన్ కథల్ని పిల్లలకోసం తెలుగులోకి తెచ్చారు, అనిల్ బత్తుల. ప్రతి కథతోటీ మర్చిపోలేని సోవియట్ బొమ్మలు! అన్నీ చాలా బాగున్నై.




- ఒక బుజ్జి పిచ్చుక. పేరు పూడిక్. అది చాలా మొండిది. పిల్లికి ఎవ్వరూ భయపడనక్కర్లేదని దాని నమ్మకం. దానికి బుద్ధి వచ్చేందుకు ఏం జరిగింది? మాక్సింగోర్కీ రాసిన కథ.
- "నీళ్ల దెయ్యం దగ్గరకు పోకు" అని చెప్పాడు అన్న. "పోనులే అన్నా" అంది చెల్లి. అయినా పోయింది. అప్పుడేమైంది? అలెక్సేయ్ తొల్‌స్తోయ్ కథ- "అన్నా చెల్లెళ్లు".
- పన్నెండు నెలలూ కలిసి ఒకేసారి వచ్చాయి, ఓ పాప కోసం. ఎండా కాలంలోనే మంచు కూడా వచ్చిందనమాట. అదెట్లా? శామ్యూల్ మర్షాక్ కథ.
- తమ్ముడిని ముసలి మంత్రగాడు ఎత్తుకెళ్లిపోతే మరి, కాపాడాల్సింది అన్నేగా? యూవ్‌గెన్ని ష్వర్ట్స్ కథ.
- వెండి గిట్ట మేక కాలితో ఎక్కడతడితే అక్కడ రత్నాలు, వజ్రాలు పడతాయి. మరి పాపకి, తాతకి ఎన్ని దొరికినై? పావెల్ బజోవ్ కథ.
- దొంగ కుక్క పాప కొన్న రొట్టెలన్నీ తినేస్తే, మంత్రాల ముసలమ్మ ఏడురెక్కల పువ్వునిచ్చింది. ఒక్కోరెక్కతో ఒక్కో వరం కోరుకోవచ్చు. మరి పాప ఏం కోరుకుంది? వాలంతినా కతమేవ్ కథ.

మిగతా కథల గురించి చెప్పేకి చోటు లేదు. ఎవరికి వాళ్లు నేరుగా చదువుకోవాల్సిందే.

చక్కని పుస్తకం. సాగబీకని అనువాదం. చదివిన పిల్లల్నల్లా మాయాలోకంలోకి ఎత్తుకెళ్లే అద్భుతమైన ఇరవై కథల సంపుటం. వీలైనంత త్వరగా సంపాదించుకోవాల్సిన మంచి పుస్తకం!

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.